# విప్లవ స్వరాలు



రచన

కవిద్వయం

దేవరకొండ



1957





వెల.
1-0-0

# తొలి పలుకు

"విప్లవ స్వరాలు" అను ఖండకావ్య సంపుటమును రచించిన శ్రీ నీలా జంగయ్యగారు నాకు కొంత కాలము నుండి పరిచితులైన కవులు. నూనూగుమీసాల నూత్నయౌవనము ఆవరించిన శ్రీ జంగయ్యగారి ఉత్సాహము అత్యంత ప్రశంస నీయము. దేవరకొండ తాలూకా ప్రాంతమున నివసించుచు, సారస్వత పఠనావకాశాలు సరిగా లేక, సంగీత సాహిత్యములకు అంతగా అనుకూలముగాని వాణిజ్యవృత్తిలో నిమగ్నులై యుండి, వీరు సారస్వతోపాసన యందు చూపుచున్న దీక్ష ఆదర్శ పాత్రమై యున్నది.

ఈ ఖండకావ్య సంపుటిలో నాలుగు భాగాలు కలవు. నాలుగు భాగము లందును జంగయ్య కవి గారి రచనలతో పాటు అజ్మతుల్లా కవిగారి రచనలు కలవు. జంటకవులైన యీ ఉభయులు తమ రచనలు ఇందులో విడివిడిగా ప్రకటించి యున్నారు. సమకాలిక సాంఘిక సమస్యలు వీరి రచనలకు ఇతివృత్తములై యున్నవి. సంఘ సంస్కరణ దృక్పథము యీ రచనలలో ప్రధానముగా కనుపించు చున్నది. సమకాలిక సమాజములోని దోషములను యెత్తిచూపి, ప్రజలకు సరియైన దారిని జూపించుట యీ కవీశ్వరుల లక్ష్యమై యున్నది. ఉదాత్త ఆశయ ప్రేరితులైన యీ కవుల సారస్వతాభిమానమును హృదయ పూర్వకముగా అభినందించు చున్నాను.

ఈ ఉభయులు సాహిత్యములో ఇతోధికముగా కృషి గావించి, మన భాషలోని ఉత్తమ గ్రంధములను చక్కగా పఠించి ఇక ముందు ఇంకను యెన్నియో రచనలు గావించి, ఆంధ్రభారతిని అమూల్యాభరణములతో అలంకరించ గలరని ఆశించుచున్నాను.

హైదరాబాదు, హేమలంబ కార్తీక పూర్ణిమ.

దేవులపల్లి రామానుజరావు

# కృతజ్ఞతలు

ఈమా విరచిత కావ్యఖండికకు అత్యంత ప్రియముతో తొలిపలుకును వ్రాసి యిచ్చిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి మా ధన్యవాదములు యీ గ్రంథ ముద్రవిషయములో యరుగళ్లపల్లి తిరుగళ్లపల్లి ప్రాంతీయ జనులలో పేరుగాంచిన శ్రీ. శీలం జనార్ధనరెడ్డిగారు చాలాసహాకరించినారు వారికినియు మరియు నా "మిత్ర రత్నములైన" చిత్తనూరు సుబ్బారావు గారికిని మానమస్సులు దేవరకొండ నివాసులు సారస్వతాభి మానులై మాకు ఆర్థికముగ సహకరించిన శ్రీ పానుగంటి కృష్ణ మూర్తిగారికిని శ్రీ. కంచెరాములుకును శ్రీ. యచ్చా మల్లయ్య గారికిని మరపురాని కృతాంజలుల ర్పించుచున్నాము.

సమకాలిక సంఘమందలి అన్యాయాలను సామాన్య జనవిదిత మగు భాషలో "విప్లవ స్వరాలను" పేరుతో ప్రక టించు నీ గ్రంథమును దీపావళికానుగా ఆంధ్రలోకాని కీయదలం చితిమి కాని అట్టిమాతలంపు ఆర్థికలేమిచే అనుకున్న కాలాని కందించలేక పోయినందుకు ఎంతో విచారిస్తున్నాము.

బ్రతుకుబాటల్లో ముండ్ల పొదలావరించ కర్తవ్య సంశ యాలోలురమై చేయవలసినదేమి లేదనుకొనుటకన్న సాహసించి మాగోడును మేము దీనిలో విషదపరచుకొన్నాము. ఎంతవరకు కృతార్థులమయినామో యది రసజ్ఞులైన పాఠకులు మీరే గుర్తెరగ వలయు.

యీ గ్రంథ ముద్రణా కర్తవ్యము నాదిగా నెంచి కృషి సల్పించిన నేత ప్రెస్ మేనేజర్ శ్రీ నాగుల రాజకనకయ్య గారికిని గూడ మానమో వాకములు.

ఇట్లు

గ్రంథకర్తలు

# కన్యావిక్రయము

కన్న బిడ్డల నమ్ముక, కడుపునింపు
కవని జీవించునట్టి పాపాంధులెపుడు
యితర బాగోగులెట్లు సహింతురివారు
కుత్తుకలదున్మ వెనుదీయ కుందురేమొ ?

అమ్మ పేరిడి బిడ్డ నల్లారు ముద్దుగా
అమ్మా! యటంచు వాడమ్ముకొనెనె?
చేతులారగఁబెంచి సేమమ్ముఁగోరునా
తండ్రి బిడ్డను నమ్మఁ దండ్రియగునె?
అర్థమ్ముఁ గోరి తానాడ బిడ్డనుబట్టి
యేకసాయికొ యీయ నిచ్చగించు
రోయక తామేని రుధిర మాంసమ్మునే
కటిక వాడైనట్టి ఖలున కమ్మ

తండ్రి కడుపునఁబుట్టి నీతనయురాలు
గొడ్డువాడైన నాకు బాగుండునేమొ?
యిన్నియిడుమలఁ బడికుందు టేమి కతమొ?
బ్రహ్మలిఖితమొ లేక నాపాపమేమొ ?

కడుపు యేలంకయై కనబుచున్నదో నాది
  కొంపవానిది యట్లు గూలకున్నె !
ఎపుడు మింటికి మంటికేక ధారగనేడ్చు
  కాల్వవానింటిలోఁ గట్టకున్నె !
ఇంతగా నన్నువాడేడ్పించు కష్టాల
  కుందడే వాడన్ని కుతల మందు
పగటి దొంగల మించు బాపంబు నొడిగట్టు
  టకుకొంప నూడ్పించుటగు బె కాదె?

అత్తయో? చూడఁ గుంటిదై యారటించు
మొగడు పుట్టంధుఁడై ప్రక్క మూల్గుచుండు
ఎంత దుర్భ్రిష్టు రాలినో, ఏమొ? దేవ!
పుట్టకను నాకు యిన్ని యిక్కట్టులున్నె?

నా తోడి సఖులు నానా సౌఖ్యములఁదేల
  దినమొక యేడుగా మనగవలసె
నాయన్న చెలియంౘ్రడు నవయౌవనము లొల్కు
  నాధులఁ గూడలో నలగ వలసె
నా నేస్తురాంౘ్రడు చిన్నారి చిట్టులఁజంక
  నిడఁజూచి కంట నీ రిడగవలసె
నా తోడి మనెడు కన్యా రత్నములు రత్న
  హారముల్నిడ వేళకన్నమింత

లేని యీ దీనురాలి లోకానఁదలప
నెవ్వరోర్తురు? ఈశ్వరా! యీ యఘోర
బాధలన్ నల్గు ప్రాణుల భరము ద్రుల్చి
కావవేదీన జన రక్షకా! గిరీశ!

నన్నమ్ముకొని బ్రతుక్క నా తల్లి దండ్రు లెం
తటి పుణ్యముంజేసి తనరినారొ?
పాపిష్టి డబ్బుకై ప్రాణమ్ము లమ్మిన
పాపియై కీర్తినిఁ బడసినాడు
ఏ కొంప ముగ్గినంతేడ్పు వానింజేరె
ఘనపాపమున కొడిగట్టుకొనెను
ఇట్టి దుర్భర ఘోర మెట్లుఁ జేయగఁజేతు
లాడెనెట్లోవాడు పాడుగాను

వానికన్నను కటికవాడైన మేలు
గాదె? భువికన్న తండ్రి దుష్కర్ముఁడైన
అయ్యయో! యింతపాప మీ యవనియందుఁ
గలదె? లోకేశ్వరా! యికఁదలప నెదను.

వానికడుపుగాల వాడేల తండ్రాయెను
కన్నబిడ్డ నమ్మిగడప బ్రతుకు
అనఘుఁడౌనె వాడు, ఆశ్చర్యమగు నాకు
పెంచిగొంతుఁ గోయుపేర్మిఁగనఁగ.

వానిబేరము గాలిపోను యీ జగమందు
దనువు శాశ్వతమె యీ ధనమునమ్మ
వాని బ్రతుక్కున బండబడిపోను యింత పా
పిష్టి సొమ్మునకాస పెట్టుకొనెను
ఎన్నాళ్లు జీవించునన్నాళ్లు వానింట
పొలుచుఁగాదే? వుప్పులొకటిన్యైన
ఏ మంచుఁ దిట్టగానేర్తు నారోసిన
తనువుఁ బెంచుటకన్నఁ దగులఁబడిన

మేలుగాదె? ధరాస్థలిపాలు మాలు
బ్రతుకొ కన్నను బండెడు రాళ్లగట్టు
కొనుచు నే బావిలోదిగ ఘనతగాదె?
పిసినిగొట్టు పాపిష్టులు పిల్లలమ్మ.

పసిబిడ్డ నమ్మిన బ్రతుక్కు బ్రతుక్కుటకంటె
పస్తులు బండిన ఫలముగాదె?
నగనాణెములుబెట్ట నయమేమి వాడిల
కన్నగొంతును గోసి గడనసల్ప
నింతగా నేడ్వనా యేడ్పుఁజెవిన్బెట్ట
కున్న వన్నెలు గుల్కుమిన్నయౌనె?
పరమాన్నమునుదిని బలసి బొజ్జలుబెంచు
కన్న సంకటి మేలుగాదె? తినగ

ప్రక్క మాడుచు నాకటిన్ బలువరించ
మెక్కు చున్నాడు కనతండ్రి డొక్కనిండ
రోత దిన్నట్లుగాదె? యీ పాతకుండు
కన్న బిడ్డను సమ్మిన ఘనుఁడు భువిని.

గుండెలో సూదులు గ్రుచ్చినట్టుల నొక్క
తడుగు మీ తలుదండ్రు లమ్మి రెంత
కైన వాడెంతటి యనఘుఁడో యని వే రొ
కర్తడగ నెంచును, అమ్మ చచ్చినాదె?
అయ్యొ బిడ్డా! యని యారాట పడిన య
ట్లడుగు నింకొకతి మీ యమ్మ పేరు?
ఇట్టులే వేరొక యింటి పెద్దమ్మ వే
కాలి పోయెనె? నిన్ను గన్నతండ్రి

అనిన నాహృది భగ్గు భగ్గనగ నిప్పు
లెత్తి చల్లిన యట్టులౌ నెవరు గందు్రి
గాయపడు నీ యెడందల కారమెంతొ
చల్లగాఁ జూచె నిటులీ కసాయి తండ్రి.

నారుమ్రుచ్చు పాడు నాగుబాముసు వోలె
పేరు దెచ్చుకొనగఁ బెరిగెనేమొ?
బుద్ధిలేని మనిషి పుట్టనా! గిట్టనా!
రోత దినుచు బ్రతుకు పాతకుండు.

అట్టి కన్నతండ్రి యవని బిడ్డలఁ బెంచి
యంగడులను బెట్టి యమ్ముకొనిన
వాని కొంప యెంత వర్ధిల్లునో పుడమి
కావె వాని చావు కర్మలకును.

చెట్టు పుట్ట లెల్ల సేవించి మాయమ్మ
చేతులార ప్రేమజేసి పెంచ
కటికవాని కరణి కరుణ యావంతయు
వీడి, యమ్మఁ దండ్రి వేలమేసె.

కోరలు లేని బెబ్బులులఁ
గూడి చరించుట నాయెఁ దండ్రియె
వ్వారలు దిక్కులేని పసి
పాపల దుర్గతిఁ బాయఁ జూతు రు
ర్వీ రథులంత మీసముల
బెంచిరిహో మము దుఃఖ వారిధిన్
నీరముఁ జేయ మా బ్రతుకు
నేరక యెంతటి ఘోరమోయికన్.

వాని పేరార యే పాపికంటను మట్టి
గొట్టెనో నా కంటగట్టె నితని
వాని నోరార, యీ పాడు బంధీఖాన
మంధిరమ్మున కిచ్చి మనెను భువిని

వాని కంటను మన్నుబడి పోను యేమి యీ
దిక్కు మ్రొక్కులు లేని దీన బ్రతుకు
వాని కొంలపయుగాల వనిత నమ్మిన సొమ్ము
ఒంట బట్టునె మంట బడక పుడమి

మొండి మొగమూర వాడెంత దండియగునొ
బిడ్డలనుగని యమ్మెడి దొడ్డవారు
కన్నకడుపే నెఱుంగని ఘనులునైరి
గొడ్డు కడుపులు గాకపోకున్నె మున్ను.

పెంట దిబ్బలపైని పేరంటమనియాడ
నొంటి కంటిన మంటి గెంటె నెవరు?
కడుపు నొచ్చెనటన్నఁ గడుశ్రమల్ బడిమందు
మాకులఁబెట్టి కాపాడి రెవరు?
అమ్మ! రావమ్మ నన్నంచుఁ జంకన నెత్తు
కొని బొమ్మలను యంగడినినిఁ గొనెను?
వాహ్యాళికై నాన్న! వచ్చెదనని యేడ్వ
నిదుగొ పావలయని యిచ్చె నెవరు?

అట్టి మా తండ్రి చేతులేమాయె నేమొ?
గొడ్డువలె నమ్ముటకు నిచ్చకొనెను వాని
కటిక దారిద్ర్యమది యంత గాలిపోను
కోమలిని యమ్ముకొని యవనిఁ గుడిచె తండ్రి.

బ్రతుకా, దుర్భరమై తపించు మగడా,
ప్రాణంబులన్ బాసిపో
వెతలన్ మంచము బట్టె మూల్గుచునికన్
వేరొక్క చో నత్త జా
ద్యతలన్ గుందుచు నేడ్చి యేడ్చి మదిరో
యన్ నాదు దేహంబు శు
ష్కితమై పోయెను. ఇంట నూకలుదినన్
సేరైన లేవాయెఁ ద
ప్పితమున్ జేసిన యట్టు లప్పు లడుగన్
వేం చేసిరీ షాహుకా
రి తనూజుల్ యిలు ముట్టి కొట్టనెటులేన్
రెకొ్కందు సర్వాత్మకా!
ధర ధర్మంబది యెంచఁ గాలునకుఁ దా
త్పర్యంబుగా మాన్య లీ
ధరఁ బాలింపగఁ జూచిరో యిటులు సు
ప్తాత్మ ప్రజా వల్లభుల్
నరయన్ గన్నులు లేని బాలికల క
న్యాయంబుగాఁ దండ్రిలీ
కరణిన్ గూనికొ; కుంటి; గుడ్డికొ ధనా
కాంక్షన్ ముడిన్ వైచి మా

కురిఁ గల్పించిరి యెంత సద్యశులో యీ
యుర్వీ తలంబందునన్.
మమకారం బిసుమంత లేక ధరణీ
మాన్యుల్ కృపాశూన్యులై
మము హింసింపఁ దలంచిరే సుకవితా
మాన్యుల్ యెదల్ జీల్చుకన్
యములై కవితలఁ జెప్పరే యవని య
న్యాయంబులన్ గాల్ప పా
పము పాడ్గాకను నిల్చునే యిక జగ
ద్వారంబుకై మీరలున్.
కనుడో! అల్లదొ! యెవ్వడో! సుకవితా
ఘంటంబు చేఁబూని యే
మని యాలోచన జేసెనో యతని మ
ర్మం బెవ్వడే మెర్గు క
మ్మని భావామృత రాగమెత్తి యెదలో
బాధల్ పిసాళింపఁ దా
ననయంబీ కనియా వివాహగతి తా
వ్యాలోలుఁడై వ్రాయురా!
ఈ యన్యాయము, యీ దురాగతము యిం
కెన్నాళ్ళు మా జీవితా

ధ్యాయంబందున నిలుచునో యది యుగాం
    తమ్మైనఁ బోనాడునే?
ఈ యార్భాట; కిరాట; కీచక; యఘా
    యిత్యంబు దుస్సాడగన్
నా యీ రోదన చాలదే? పడుచు క
    న్యల్ బెట్టు శాపంబులై.

వెల వెలఁ బోయె మా బ్రతుకు
    వీధులు ధారుణి శృంగభంగమై
కలవరమేమొ? మా యెదలఁ
    గాల్చును, యియ్యది ఘోరమెంతయో,
తలపగఁ దండ్రి బిడ్డలను
    ధారణజేసి ధరిత్రి నమ్మ వా
కిలి కళలుండునే, యతని
    కిన్ మదిదోపదె? కాదు కాదురా

అని తలపోసి యామృదుల
    యౌవనియించుకఁ బారఁ జూచి మో
మున రుధిరమ్ము ముద్దయయి
    మోవ ముఖంబిడి గద్గద స్వర
మ్మున నిటుబల్కె కన్నెవల
    పున్ బలిగొన్న కసాయి లోక మే

కనికరమెంచ బోక నను
గన్న మనీషిని ముంచెనంతయున్.
ఒకఁడు నే దేశనాయకుడంచుఁ బచ్చని
కాపురమ్ముల మంటఁ గల్పనెంచు
ఒకఁడు నే నూరికంతయుఁ బెద్దనని కూడఁ
గట్టు నాల్మగల నేర్వెట్టఁ జూచు
ఒకఁడు నే తేనెపుడకవోలె నటియింతు
నని లోకమున్ బుక్కటను బిగించు
ఒకఁడు నే నైదూళ్ళ యెకిమీడునని పేద
యింటి వాసమ్ముల మంటఁ గూల్చు
ఒకఁడు భక్తుండననుచు వేరొకఁడుగురుని
వేషములఁ దాల్చి యిల్లిల్లు వెదకి వెదకి
పట్టపగలైన, కన్నముల్ బెట్టనెంత్రు
యిట్టి లోకాన జీవితం బెట్లునడచు.
మెత్తని గులాబి పూవుల గుత్తుల కడ
నిశిత కంటకా లెన్నియో నెగడునట్లు
పరదయార్ద్రి మనీషుల పంచ లొదిగి
పాతుకొన్నది పీడిత నేత్ర వితతి.
ఏ విధి మంది కొంపలను
యించుక మాత్రము ముంచఁ గూర్తు నే

నే విధి పేద బాపుల పు
　　　　నీతుల దోతునటంచు నేడ్చు నా
ఘూవరు లెంతురే? యెదను
　　　　బొంగిన యీ వనితా తపంబు సం
భావనఁ జేయ లోకమున
　　　　ప్రాజ్ఞులకే మదిఁ దోచుఁగావుతన్.

మండిన యట్టి నా హృదయ
　　　　మంటపతచ్చిక లుబ్ధముష్కరో
ద్దండుల స్వార్థఘాత మెదఁ
　　　　దాడనఁజేయదె వజ్ర యస్త్రమై
గుండెల నిండు జవ్వనము
　　　　గోల్కొన జాతికి వీరనేతగా
తాండవ మాడదే? ధర వి
　　　　తర్దులపై నటరాజ మూర్తియై.

మోసముజేసి మా బ్రతుకు
　　　　మూల్గులకున్ బలమిచ్చు రక్తమున్,
ఆసిలి సౌఖ్య దాహమున
　　　　నందల మెక్కిరి చావునెంచి దు
ర్వాస శిఖామణుల్, మది న
　　　　పౌరుష తేజమడంగి క్రమ్మరన్

ఘాసిలఁ జూచినారు కన
        ఛామల గోడు యదెంత తీపియో?
పాప నియంత, రాజ్య పరి
        పాలకులంత ధరిత్రిఁ గూడిరా
ఓ పతితాది మానవత
        ఓ నవతావనినేత యిట్టి లో
భా ప్రభులందఱున్ మనల
        బాధలఁ బెట్టిన వారుగారె? మీ
నాపయిఁ గాదుయింత కరు
        ణాన్విత గాధ వచో విలాసముల్.
ఏనుదరిద్ర కోమలిని
        యే యయినన్ సమకాలికా దరి
ద్రానుగులన్ బొరించు భయ
        దానవతన్ దునుమాడ నిట్టి రో
షానల కావ్యరాజమున
        కాదరమున్ గయిసేయమంచు ను
న్నాను రచింపుమో సుకవి
        నాథ దరిద్ర కవోష్ణ బాష్పముల్.
అందఱి ప్రాణ మానముల
        నారడి వెట్టి సుఖావలోకనా

నందముఁబొందు మృచ్ఛ మృగ
నాయకులెల్లఁ దపింపరేలొకో!
కుందుచునున్న నా బ్రతుకుఁ
గూల్పగనేమొ? మతేమొగాని యీ
గందరగోళ మంతఁగనఁ
గా మది గాయము రెచ్చిపోయెరా!

పండిన పాప భాండము గు
భాలునఁ గూలక యున్నె, యెన్నినా
ళ్ళుండిన దిక్కు మొక్కు తెరు
వుండునె దానికి హింసఁ గూర్చు, ఉ
ద్దండుల పాప దానవత
దాగునె లోకమునందు నీచులై
కండలు పెంచినారు కను
గానని కావర మెక్కి క్రక్కగన్.

పన్నిన పద్మవ్యూహ మది
పాడగు కాలము దాపురించె లే
కున్న నిదే పరార్జితపు
నూహఁ బ్రమత్తుల చేతనీల్గి యె
న్నెన్నొ మహా ప్రయాసల న
నేక జనంబులు జత్తురోయి మా

యన్నల మోసమంత నుద
యాద్రిని నెత్తిన దుమ్ముకై వడిన్.
దినమొక రంగు మార్చి కడ
తేరుదమన్న ధరిత్రి నెవ్వరున్
గనుగొన సేరకుందురు యు
గాలను, పుక్కిటఁ దాల్తమన్న వా
నిని యెదిరించు కాలము మ
నీషుల కుండక పోదుగాన నీ
మనుజ మహత్వ రాక్షసత
మారణ హోమముగాదె? ఓ కవీ!
నిను నీ కవితను గూర్చియు
మనమునఁ దెల్యంగలేక మాంద్యులు దిట్టన్
ఘనతకు వాడిమి తరుగునె?
యినునకుఁ గప్పినతమస్సు, యెన్నాళ్లుండున్.
కవులనుచు వెఱ్ఱికుంకలు
నవమానముఁజేసి మొరుగనగునే మదిరా!
కవియన్న వాని కర్థము
నవగతమే? దుష్ట; ధూర్త; యార్యులకు నిలన్
గుండెలు బీకి రక్తమును
గ్రోలిన తస్కర విక్రమ ప్రభూ

మండలి పౌరుషంబు లల
　　మం గదలంగద వేర! వీరమా
ర్తాండులు లేచి భూమిపయి
　　రాజిల నిద్దురలేచి వేగ రా
కుండు టదేలనోయి! విష
　　కుంభ హృదాస్థలి నాట్యమాడగన్.

జాతి మతంబు మానవ ని
　　జాయితి కంతకుఁ జేటు భారతీ
జాతికి దూరులై కుటిల
　　శాసనముల్ గయిసేయ నెంతురా?
ఘాతుకులార! ధర్మమును
　　ఘాతుకఁ జేసెదరా? హరే! హరీ!!
పాతకులార! దుష్టమృగ
　　భావ పరంపర ఉల్లసిల్లగన్.

అని కవితా కుమారి మరి
　　యాదల నౌదల నన్నుఁజేర్చి మె
త్తని కరచాలనంబున సు
　　దారత బుద్ధినిఁ దట్టి, ఓ కవీ!
వినుము మహత్వ మానవ వి
　　వేకుల సంకుచిత ప్రభావ వం

దనముల గర్వ మానవ మ
దాంధుల జీవిత కావ్య రాజమున్.

పలికెను నిట్టుల, కవితా
కలికి మృదు వచన భావ గంభీరతతోన్
గలవారి మోసముల కిల
బలియయ్యెడు పేద బ్రతుకుఁ బాడుము తండ్రీ!

అరి భయంకర ఘోర సంగరము నందుఁ
బ్రభుతఁ గాంచెడి విజయ దుందుభుల మోత
కౄర్య హృదయాల నిప్పు కరకు మండి
చఱువఁ దేలును, పచ్చి కుండలుగ నంత.

ఎవఁడో? పాతకుఁడుర్వి పాపమును బో
నేలా మదిన్నెంచు నీ
నవరాగంబులఁ గుందు నీ వనిత న
న్యాయంబుగా ముంచె నీ
భువి ధర్మంబను మాట మిథ్యగను యై
పోయెన్ వృథా లోక సం
స్తవ మింకెందుకు? సాగిపొమ్ము కవితా,
సత్యంబులన్ బాడుచున్.

మీసలు బెంచి హంతకులు
మేమె మహాత్ములమంచు లోక వి

న్యాసముఁ జూప నెంచెద ర
నాథుల పొట్టలఁ గొట్టి దుమ్ము స
న్యాసులుగా నటించి కడు
నాడిరి నాటకముల్ యవెన్నియో
దోస మటంచెఱింగి మఱి
దుష్ట శిఖామణు లంద ఉర్విపై.
అన, కవి సత్తముఁ డెలమిన్
మనమునఁ దర్కించి లోక మర్మంబుల క
మ్మని తేట తెల్గు భాషల
విన నింపగునట్లు వేడ్క, పేర్కొన నెంచన్.
ఏవో! భావము నొచ్చుచుండు గనగ
న్నే యూహాలోఁ దట్టు నా
భావా వేదన లెన్నియేని కవితా
భ్యాసంబునన్ గాలిలో
ఠోవన్ నిచ్చును, ప్రాణ వాయువుల త
ద్బుద్ధిన్ విచారించి ప్ర
స్తావం జేయును దొంగనీతుల యుదం
తం బంతయున్ వ్రాయగన్.
కాల సమాధిలో బ్రతుకు
గారడి వింతలు పేద యింటి వా

సాలకు ముప్పుఁ గూర్చి కలు
    షాత్ముల పాలిటి కల్పతరువ్వులై
మేలును గూర్చు నియ్యది య
    మేయ పదంబుల తోడఁ గూర్ప మా
కేల యటందురో? మదిని
    నేమనుకొన్న విష ప్రపూర్ణులే?
అప్పు తాకట్టున నమ్మె నా యూరి దొ
    డ్డకుఁ జెల్లుబెట్ట బిడ్డలను, తండ్రి
పెట్ట కుందమ యిల్లు బెకిలించు డిగ్రి దూ
    తలఁ దెచ్చునో? యని తలచినాడ
కాక! ఏ దొంగ నాగన్నల రాయబా
    రమున మెత్తని గుండె రాయి యయ్యె
నైన నే కొంపారునంత యాపదల పాల్
    జేసి రిమ్మహి దేశ సేవకులును
  హాయిమను కూతు నమ్మంగ నవని యందుఁ
  గల్గు కారణములఁ దెల్పఁ గలమె వేరు
  తండ్రియే లేక లుబ్ధుఁడై తనయురాలి
  నమ్మెనో? సొమ్ముఁగొను నా సఁగ్రమ్ముకొనియు.
నాల్గు వేదములు ననవరతము బల్కు వి
    ప్రుల ముందు కన్య విక్రయము జరిగె

దేశ సేవాభిరతిన్ వెల్గు నాయకా
గ్రగజుల ముందిట్టి విక్రయము జరిగె
సంఘ సంస్కార సంసక్త చిత్తుల కన్ను
గవనింత ఘోర విక్రయము జరిగె
స్త్రీ జనాభ్యుదయ సంశీల సంరక్త-సం
ఘాధ్యక్షుల కడ విక్రయము, కన్య!

దేశ దౌర్భాగ్య చింతన వాశిగాంచి
నారలా! మానవులు యీ యఘోర పాత్రి
కాన్వితులుగను వెలసిరీ కన్య నమ్మి
పెళ్లి మంటపమునె పిల్ల పీడ గోరి.

యీ గాంధేయ యుగమ్ములో విమల యో
గీశ్వర్భక్త, సౌజన్య సం
రాగారావ విపంచికావళుల ని
ద్రాణించిరో, మాన్యులీ
భూగోళంబున వన్నెమించ నచిర
స్ఫూర్తిన్ విరోధాల సం
భోగా సక్తులునై; తరింతురిక స
ద్బుద్ధి ప్రకాంద్రుర్విలోఁ.

# పంద్రాయగష్టు



కలరవంబులుఁ జెట్లఁ గిలిగింత లిడఁ పక్షి
ప్రకరంబు లెలమితో పాట బాడఁ
చలిదెమ్మెరలఁ మల్లికల వల్లరీ పిల్ల
మొగ్గలతోఁ గూడి మురియు చుండ
పిల్ల గాడ్పులు నల్ల నల్లన చలి దుప్ప
టుల మూగి నటు నిటు వలపు రేప
చంచరీక చయంబు సంతరించిన పూల
తావి తేనెలు నేల దడపుచుండ.

విమల తోజ్వల మానసో ద్వీధులందు
పరువులెత్తుచు జయ జయ ధ్వాననముల
నిలిపి నాడోయి! మూడు వన్నెల పతాక
కదలి వచ్చెను! "పంద్రాయగష్టు" నేడు.

నల్ల నల్లని మబ్బులు తెల్లనాయె
కన్ను విప్పియు కనవోయి కాంతి వెలుగు
కలరవ ధ్వను లెగసె నిన్గన్న భూమిఁ
లెమ్ము ఓ! భారతీయ! వేగమ్ము గాను.

దిశలు మ్రోగెను వేగుట తిమిర తతులు
గుహలు దూరెను జ్యోతి వెల్గొందె భువిని
కనుము లే నీదు దేశంపు క్రాంతు లెల్ల
లెమ్ము ఓ! భారతీయ! వేగమ్ము గాను.

నలుబది కోట్ల వీరుల మ
నమ్ములు నేడు స్వతంత్ర భారతీ
యుల మయి పోయినా మన మ
హోదయ రేఖలు భారతావనిన్
వెలుగులు జిమ్మెరా! గగన
వీధుల నాట్యము జల్పె, మూడు వ
న్నెలు గల కేతనంబు యువ
నీతల మెల్ల మహర్ష మొందగన్.

భారత వీరులెల్ల కడు
భ క్తి సమన్వితులై స్వతంత్రతా
హారతు లెత్తినారు విజ
యాంజలు లర్పణజేసి, సద్గుణో!
దార జనమ్ములార! మయి
దాల్పుడు దివ్య యశ స్వరూపముల్
ధీరవరేణ్యులై భువిని
తేజము నింపుడు దిగ్దిగంతమున్.

పర ప్రభుత్వపు రాక్షస పాలనంబు
విరగడయి పోయినట్టి దీ విమల వేళ
సాగిపోదము నేడు సుస్వాగతముల
భవ్య భారత స్వాతంత్ర్య ప్రభల ముందు.

అది స్వాతంత్ర్య సముజ్వల ప్రభయుగా!
నాకారముందాల్చి కొ
ముదులన్ వెల్గెను స్వేత పాలకుల కా
యోద్ధ త్వదీయంధతన్
తుదకుముట్టింపగ భవ్య భారతము సం
తుష్టి ప్రవాహమ్ములో
కదలం జేయగ యీ త్రివర్ణ శుభదా
కారంబునై వెల్గెరా!

భరత వీరుల యదం ప్రభవింపజేసి స్వే
చ్ఛా లక్ష్మికిన్ ఛత్రశాల గట్టెఁ
స్వేత జాతీయ గజేంద్రమ్ము పయి వీర
సింహమ్మై హోరు గర్జితలు జల్పె
యీ త్రివర్ణమె స్వేత శాత్రవ గుండియల్
కమలింప శాంతి సంగరము గరపె
యీ పతాకమె లోకమెల్ల కాకలు వెట్టి
పరపాల భయ దానవతను బాపె.

ఎందరో దేశ నాయకు లిడిరి ప్రాణ
ధనము లన్నింటి నీ పతాకమ్మునిలుప
భారతీయ ప్రజావళి ప్రాణచయము
లలరగా పూజ లొనరింప వలయుగాదె.

భరత వీరుల రక్తమ్ము నొడపి దాన
స్వేచ్ఛమై దాల్చి స్వాతంత్ర్య సిద్ధినొంది
నిలువు కొన్నది మూడు వన్నెల పతాక
మల్లదో గనుడు స్మృతి పథమ్మందు నిలచెఁ.

యీ నా భారము భూమి నెల్లరును గ
ర్హింపన్ సదా మంజులో
ద్యానా వీధుల బాడుకొందు కవితా
ధ్యాన్నంబు గావింతునే
నే నాడైన ధరిత్రిలో మఱపు రా
నీ గాక నీ ధాత్రియున్
బోనాడన్ యనియంచు భారత కవీ
పుత్రుల్ యదం గొల్వరేః.

స్మరియింపరేః నాటి సమర దీప్తులు దేశ
కల్యాణ సుగమ కైంకర్య సిద్ధి
గతియించునాః జాతి పిత గాంధి వాక్సుధా
రాశి వీచికల కార్పణ్యా రవళి

సమయునేః రామరాజ్య స్థాపనార్య జ
హ్వారులాలు కీర్తి భాస్వరత లుర్వి
మలగునేః భారత క్ష్మాతలి రాజేంద్ర
బాబు సందేశ సంపదల దీప్తి.

యుగ యుగమ్ముల చీకటి పొగల ద్రుల్చి
నిల్పదే జాతికీర్తి పునీత చరిత
భవ్య భారత మోముల పంట వరిగి
విశ్వ సారథ్యమున మేళవింప వలయు.



# శాంతి ధూత

పారతంత్ర్యద్దాస్య బంధనమ్ముల ద్రెంప
స్థాపించె సమర స్వాతంత్ర్య దీప్తి
క్రూర పాశ్చాత్యుల కుటిలత్వ మణగింప
వెలిగించె శాంతి జ్యోతులను భువిని
కరకు కసాయి వర్గము కహింస పథంబు
జూపి దానవతల బాపినాడు
పీడిత ప్రభువులన్ ప్రేమాస్త్ర శస్త్ర స
త్యమున గూల్వంజేసి తనరినాడు

మత పిశాచుల నెల్ల తా మంట గూల్చ
ధర్మ గీతికలెల్ల హస్తమున బూని
భవ్య స్వాతంత్ర్య గీతికల్ బాడి లోక
మున మహాత్ముడు విఖ్యాతి మనెను గాదె?.

క్రమ్ము నీ దాస్య గాఢాంధకార మందు
వెలుగు పులుగవతార మెత్తిల మహాత్మ
డొక్కడే జిమ్మివైచెరా! నిక్కముగను
కర్మ చంద్రుడు గాడె మా గాంధి తాత.

ఇంటింట రతనాల పంటయై విలసిల్లు
నూలు పోగుల రాజ్యమేలు పెద్ద
స్వాతంత్ర్య సమర ప్రభా భాశితోజ్వలు
లయి మెల్గుడనియు గీతయును బల్క

కష్టించినద్దాన గల్గు భాగ్యమె భాగ్య
మనగట్టు నాగోచియును వచింప
బలముతో బానిసత్వము బాప తనకేల
కత్తి విక్రమ పరాక్రమము జూప

వచ్చెరా! కుచ్చుకొల్లాయి. మెచ్చుతలను
కండ్ల కద్దాలు, కాలికి కాలిజోడు
నూతగొని శాంతి దేవత నేతవోలె
కర్మచందురు డనగ మా గాంధి తాత.

పలికిన పలుకులో నొలికె ముత్యాలన
శాంతి పాఠముల విక్రాంతి గూర్చె
నవ్వెనా తన బోసినవ్వుల వెన్నియల్
విరిసినవన దేశ వెలుగు జూపె
కదలెనా! ముసలి ముక్కాలి యడుగుల వెంట
రయము నేతెంచు స్వారాజ్య లక్ష్మి
నిలచెనా! శత్రువుల్ వలచి స్వాగత మిడు
నన తెల్లదొరలు వందనము లిడరె?

భారతీయుల కడు తపః ఫలము గాక
బుట్టుదురె యిట్టి పుణ్యులు భువిని నెందు
భారతీమాత రత్న గర్భనుట కిట్లు
పుణ్యులను గనిపెంచె గాబోలు నేమొ ?

గర్జించునా! సింహ గర్జన ధ్వనులీను
వైరిగణంబులు బర్వులెత్త
దయనెంచునా! నతని ధార్మిక హృత్పీఠి
తాండవింపదె జనాదరణ ప్రీతి
మదినెంచెనా! మాల మాదిగలే దేవ
తలని అహర్నిషల్ దలపు గాదె
వివరించునా! కర్మవీరులై దేశసౌ
భాగ్య సంపదల కాపాడు మనుసు.

పట్టుదల బూనెనా! విడచు ప్రాణచయము
ఎట్టి దుర్బుద్ధులను మది బెట్టకుండు
విశ్వ శాంతిని నెలకొల్పి వినుతిగాంచె
కర్మ చందురుడనగ మా గాంధి తాత.

స్వేత ప్రభుత్వ పాలనము
చిందులు ద్రొక్కుచునుండ భారత
క్ష్మాతలి శాంతి సత్వమున
మారణ హోమముసల్పి భారతీ
జాతికి క్రాంతి గూర్పవె య
శశ్చరి తాత్మక! నీయమోఘ భా
వాతతి లోకవాణి హృత్
పద్మ ప్రఫుల్ల మొనర్పదే భువిన్.

# లుబ్ధాగ్రేసర చక్రవర్తి

ఉ. ధారుణి ధూర్తుఁ డొక్కరుఁడు
దక్షయ నామముతోడఁ దొల్లి రో
షారుణ నేత్రుఁడై దశ ద
శాబ్దము లర్థులఁ దూరుచున్ మహో
దారుణ లీల దండమున
దర్ప మెలర్పగ హుంకరించి ఒల్
శూరునిమాడ్కిఁ బ్రత్యహము
శోషిలఁజేయు నుదగ్రచిత్తుఁడై.

క. కుడువడు మృష్టాన్నంబును
దొడుగడు విలువైన మేలిదుస్తుల నెపుడున్
విడువడు గుప్పెడు ధాన్యము
తుడువడు లోభంపుమచ్చఁ దొలగగ ధరణిన్.

శా. లుబ్ధాగ్రేసర చక్రవర్తి యన భూ
లోకంబు ఘోషింపఁ బ్రా
రబ్ధంబంచుఁ దలంచు ధర్మమన నీ
ర్ష్యాసక్త చిత్తుండునై

స్తబ్ధత్వంబు వహించి సంతతము స
చ్చాంతంబు వర్జించి దుః
ఖాబ్ధిన్ మున్గు ధనంబునెంచి పరమా
హ్లాదంబు స్తంభింపగన్.

ఉ. భూతలమందు నాతనిని
బోలిన బుద్ధుడు గానరామి వి
ఖ్యాతి గడింపఁ జేయ సము
ఖంబును జేరిన మిత్రవర్గమున్
శ్రోతగఁ జేసియున్ సరస
శోభిలుచున్ బహు భంగుల న్మహో
నీతుల నుగ్గడించి కడు
నేర్పువహించి తొలంగఁ జేసెడిన్.

ఇట్లుండ నప్పరమ బుద్ధండగు కోటీశ్వరుని గృహంబునకు దూర దేశంబునుండి కుల గురుండగు నొక్క యారాధ్యుం డరుగుదెంచి చెంతఁ గూర్చుండినను నమస్కరింపక యున్న శిష్యుని దీవించి యిట్లనియె.

తే. నేను భవదీయ వంశవార్నిధికి గురుఁడ
మ్రొక్కి సేవింపవేల సమ్ముదముతోడ
సరసమైనట్టి కట్న మొసంగి నేడు
సాగనంపుము శిష్య సంచారమునకు.

చ. అనవిని శిష్యుఁడిట్లనియె
నార్య మదీయ గురుండు వైష్ణవుం
డనుపమ పుణ్యరాసి సద
యాత్ముఁడు దర్శనమిచ్చెఁ దొల్లి నే
ననువుగ సేవఁజేయగ మ
దాత్మ నెఱింగియు బోధనామృతం
బును గురిపించి యేగెను సు
పూజ్యుఁడు దీవనలిచ్చి మెచ్చియున్.

అప్పలుకుల నాలకించి గురువరుం డాశ్చర్యాన్విత చిత్తుండై స్వపురంబునుజేరితన ప్రియమిత్రుండగు నొక్క వైష్ణవ ప్రముఖున కీ యుదంతంబంతయు నెఱింగించి యతనిఁ బరిశీలింపఁ బంపిన నాతండప్పరమ లుబ్ధుపాలికింజని యిట్లనియె.

క. ప్రియశిష్య ! నీకు జయమగు
దయతో గురుకట్న మిచ్చి తద్దయు వేడ్కన్
రయమునఁ బంపుము పోదు వి
నయమును మదియందుఁ బెనగొనంగను ధాత్రిన్

ఏను పరమ వైష్ణవకుల సంజాతుండను. నీ కుల గురుండను, మచ్ఛిష్యుండవగు నీ కెద్దియేని సంశయంబుఁ గలదేని భవద్వంశావళి క్రమణికను విన్పించెద వినుమనిన నా లుబ్ధాగ్రేసర చక్రవర్తి యిట్లనియె.

క. ఆరాధ్యుఁడు మద్గురువరుఁ
డారాధించెదను నిశ్చితాత్ముఁడ నగుచున్
దారా వైష్ణవులయ్యును
ధారాళంబుగను బల్కఁదగదు మహాత్మా !

అనిన విని యా వైష్ణవ ప్రవరుండంతట నిజ నివాసంబున కరిగి జరిగిన యుదంతంబంతయుఁ బూసగ్రుచ్చినట్లా రాధ్యున కెఱింగించి యతనిం దోడ్కొని క్రమ్మర వర్తకుని సందర్శించి యిట్లనియె.

తే. ఏను వైష్ణవుఁడనుసరి, యికను వినుము
రాణకెక్కిన యారాధ్య రత్నమితఁడు
నీకు వలసిన గురునిఁ బరాకుమాని
సత్వరము సేవఁజేసి మోక్షంబుఁ గనుము.

అనిన విని యప్పరమ లుబ్ధుండిట్లనియె.

క. గర్వదరిద్రులు మీరిటు
లార్భాటముఁజేసి ద్రవ్య మార్జింపంగన్
దుర్భరము నాకు వినుఁడే
నర్భకుఁడనుగాను జుమ్మి యదిమీ కొసగన్.

అంతియ కాదు, ఏను నాస్తికుండను. కావున మీ యిరువురి యందెవరును నాకు గురువులు గానోపరు. ఇటువెడలి పొండనిన

వారలతి త్వరిత గమనంబున స్వస్థానంబునకుం జనిన యనంత రంబ, దక్షయ మిత్రుండు గృహంబున కేతెంచి సాంత్వన వాక్యం బులతో నిట్లనియె.

క. అయ్యా ! పాపము గుటుపులఁ
గయ్యంబునఁ గూడునీళ్ళుఁ గానకయుండ౯
దయ్యములా వారలు నీ
నెయ్యంబును దూరు దుర్వినీతులె చెపుమా ?

అయ్యది యటుండనిమ్ము.

క. శివభక్తుఁడనగు నేనీ
శివరాత్రికి వారణాసిఁ జేరగవలయు౯
భవబంధములను బాయగ
శివపూజలు సల్పబుద్ధి, చేకురెనాకున్.

ఇయ్యది మంచి శరుణము. నీవును రావలయుననిన లుబ్ధా గ్రేసర చక్రవర్తి హర్షోత్కర్షంబునఁ గాశీపురంబును సందిద్యం చిన యనంతరంబ.

తే. గంగలోమున్గ నీ బిచ్చగాండ్రునన్ను
బ్రతుకనిత్తురెయని యొక్కపాడు మడుగు

లోనమున్గియు లేవ నీ లుబ్ధుఁజేరి
శంఖ మప్పుడు పూరించె జంగ మొకడు.

అప్పు డప్పురమ లుబ్ధుండిట్లనియె,

తే. ఓరి జంగమ ! భిక్షుసుగోరి యముని
చందమున నన్ను బాధింప జంకబోను
సిగ్గుగలదేని యత్యంత శీఘ్రగతిని
పొమ్ము నాచెంత నీతాత సొమ్ము లేదు.

తే. కష్టపడి మద్గృహంబును గంటివేని
నేను నీయందు దయఁదల్చి నిరుడు పండు
రాగులుండిన సోలెడు రయము మీరఁ
బెట్టి పంపుదు గుండె గుభేలు మనగ.

తే. రాగులకు దూరదేశంబు రావుగాని
రాగ, దిగ్భ్రమ జనియించి రహిఁదొరంగి
పస్తుపండిన నీకు బాపంబు దక్కు
యాచకునకిడ నాకుఁ బుణ్యంబు దక్కు.

తే. దివ్య క్షేత్రములన్నియుఁ దిరిగి తిరిగి
పురముఁ జేరను నాకు వత్సరము వలయు

గడవు లోపల వచ్చిన కాంక్షదీరు
రాకయుండిన రాగులు రావు నీకు.

కావునఁ దొలంగిచను మిప్పుడేను విశ్వేశ్వరుని సందర్శింపఁ బోయెదననిన విని జంగమయ్య, అప్పరమ లుబ్ధుం బాసి చనిన యనంతరంబ.

తే. చంద్రమౌళిని దర్శింపఁ జనఁదలంచి
పూలు పత్రినిఁ గొనకనే పోయిమ్రొక్కె
కాని, పూజారికీయక, కడకుఁ దొలగె
వానిఁబోలిన లుబ్ధుండు వసుధఁ గలడె.

ఆ. సూర్య; చంద్ర; తార; హారముల్ గలవారు
దైవపూజచేసి తరలు నపుడు
దాన ధర్మములను దగఁజేయఁ గాంచియు
సిగ్గుపడడదేమి చిత్రమొకొ్కొ.

క. దక్షయ కావచ్చు నితం
డక్షయమగు ధనముఁ గూర్చి యాహ్లాదమునన్
లక్షల యేండ్లీ జగమున
రాక్షసుఁడన్ బేర్గడించు రానిక్కముగన్.

క. అనుజసులను గనుగొనియును
మన మలరగ మాటలాడి మఱలెడు వేళన్.

ధనమే కీర్తికి మూలం
బనుకొని యిలు సేరె గృహిణి యాశ్చర్యపడన్.

గృహంబున కరుదెంచిన భర్తృ పదార విందములకుఁ బ్రణమిల్లి వారణాసి యాత్రా విశేషంబులఁ దెల్పఁగోరిన జాయతో నతఁడిట్లనియె.

తే. బంధువులు రోయుచున్నను భయములేదు
భిక్షువులు దిట్టిపోసిన బిడియపడను
ధనము వలెనన్న ధర్మము తరలవలయు
ధరను లుబ్ధత్వమెన్నఁ బ్రధానమగును.

అనిన పతికి సతి యిట్లనియె.

తే. నేను వాంఛించు టొక్కటి నీవు నుడువు
విషయ మొక్కటి, యిది యెట్టి వెఱ్ఱితనము
ధరను లుబ్ధత్వమేల ప్రధానమగును
ధర్మగుణమన్నఁ బ్రాధాన్యతను వహించు.

అనిన విని యా పిసినిగొట్టు యిట్లనియె.

తే. నగలు వలెనన్నఁ దెచ్చెద వగవవలదు
ధనము వలెనన్న మనయింట దరుగులేదు
ధాన్యమన్నను గరిసెలు తరుగబోవు
ధర్మమను మాటఁ దల్పకు తరుణి నీవు.

అయ్యది యటుండనిమ్ము మఱియొక రహస్యంబుఁ గలదు వినుమని చెవిలో నోరుఁబెట్టి.

తే. జంగమయ్య యుదంతంబు సరగఁ దెలియ
పఱచి జాగృతిఁ గనుమన్న ఫక్కిదారి
పక్కమని నవ్వెనప్పుడా పడతిమిన్న
లోభి మగని గుణంబు లోలోనఁదలఁచి.

ఇట్లుండఁ గొంత కాలంబునకు.

తే. వత్సరమునిండె, జంగము వచ్చునంచు
భార్యతోఁ జెప్పి గడ్డిలోఁ బవ్వళింప
రానెవచ్చెను జంగము రాజమౌళి
రాగులనుగొనఁ గృత్రిమ రోగికడకు.

అయ్యో! ఈతనికేమి సంభవించెనో యని చెంతఁగూర్చుండి దక్షిణ హస్తంబునుగొని నాడినిఁ బరీక్షించి తన మనంబున నిట్లని వితర్కింపఁదొడంగె.

తే. ఆలుపిల్లల రోదనమైన లేదు
కష్ట దశయందు బంధు వర్గంబు లేదు
తల్లిదండ్రులు సోదర తతియు లేదు
దయను జాటగ మిత్ర బృందంబు లేదు.

తే. లోకమునఁ బేరు గాంచిన లోభి యితఁడు
రాగులను గూర్చి కాబోలు రోగియయ్యె
నితని రోగంబు వాపు దదేమి లెక్క-
టంచుఁదలపోసి కులకాంత నటుఁ బిల్చి.

తే. అవని దీని ధనుర్వాత మందు రిపుడు
గజము నిడుపైన గరిటెయు గంపెడన్ని
ముద్ద పిడకలు తెప్పించు, ముదముదక్కి-
కూరుచుండినఁ గీడుచేకూరు నమ్మ!

తే. ఏల సంశయమింకనీ వేగిమైనఁ
దెమ్ము శీఘ్రమ్మె వస్తుద్వయమ్మె చాలు
వాతలను బెట్టి వరుని లేవంగఁ జేసు
మాయ రోగము దీనినే మాన్పుదమ్మ!

అంత నమ్మగువ, వస్తుద్వయమ్మును దెప్పించిన జంగ మయ్యయు జాగు సేయక ముద్దపిడకల పోగ్రుచేసి యందగ్నిం జొనిపి. చేటతో విసరి, గంటెను ఎఱ్ఱగాఁ గాల్చి వాతఁబెట్ట సమ కట్టిన సమయంబున నా లుబ్ధాగ్రేసర చక్రవర్తి క్రోధోద్రేక మానసుండై కులకాంతతో నిట్లనియె.

తే. జంగమా కాడు నా పాలి జము డితండు
కాశి యెచ్చట యీ పాడు గ్రామమెచట

భిక్షఁగొన వచ్చె నావంత బిడియ పడక
కాంత ! నోలెడు రాగులు కాలబెట్టు.

అప్పలుకుల నా కర్ణించి జంగమయ్య యిట్లనియె.

తే. ఓరి లుబ్ధుఁడ! ఖలుఁడ! ఓరోరి పాపి!
నీదు మానస మారయ నేను వచ్చి
నాడ నోర్మ్యాయు. పేర్లికు బోడ ముండ
రాగులను గొన రాలేదురా నిజంబు.

తే. నీవు మానిసివా ? కావు నిశ్చయముగ
దొడ్డ పసరంబుగా నోపు, ధూర్త ! దొంగ !
అదియ మేలన్న నాకు సత్యంబటంచుఁ
దోచుచున్నది వేరొండు దోచ దహహా !

తే. గార్దభము మేలు నీ కన్నఁ గనుగొనంగ
మానవాకృతిఁ గనినట్టి దానవుఁడవు
ధార్మికత్వముఁ బాసిన దయ్యమీవు
లోభివై పుట్టినాడవే? లోకమందు.

తే. చక్రవర్తులు చనినారు జగము విడచి
వారలేమైనఁ గొనిపోయి నారె? కుమతి;
నీవు లుబ్ధత్వమున మని నీల్గితేని
మూటఁ గట్టుక పోదువా? ముదము హెచ్చి.

ఇట్లా జంగమయ్య క్రోధా యత్త చిత్తుండై పరుష భాషణంబు లాడి చనిన యనంతరంబ, లుబ్ధా గ్రేసర చక్రవర్తి ధనాగారం బును, తస్కరులు కొల్ల గొట్టిరను వార్త భూలోక మందంతటను వ్యాపించెను.

ఆ. తస్కరులకుఁ గాక దైవ భక్తులకెట్లు
లోభిధనము చెందు లోక మందు
దాత ధనము చెందు దైవ భక్తులకను
బుధుల పల్కు రిత్తబోదు నిజము.



౧

# ఓ! కవి

ఓ! కవీ!....ఓ! కవీ.....ఓ! కవీ!........

నీ మహోన్నత భావ జలధిన్
నెగడెరా! శబ్ద ప్రపంచము
పండెరా! రతనాల పంటలు. ఓ!....
నీ కరాబ్జములో వెలింగెడు
పాకశాసుని సుధాఘుంటము
నీవిచారములో స్రవించును
భావిదేశాభ్యుదయ చరితము. ఓ!....

౨

# వెలుఁగు దివసములు

కరుడు కట్టిన రాక్ష సత్వం
తరిగి పోయె కాల వేగం
మరుగు బడిన మానవత్వం
పరుగు లెత్తె వెలుగు దినములు
వస్తున్నవీ కదలీ వస్తున్నవీ.

సర్వ మానవ శక్తి కొాక
నిర్వాణ పథ సూచికము దెల్పెడు
నిర్విచార వయస్సు సందలి
పర్వులెత్తె కాంతి దినములు
వస్తున్నవీ కదలీ వస్తున్నవీ.

బుసలు గొట్టె కాలసర్పపు
విసపురాశి సుధా తరంగిణి
మసిని గప్పిన మణి విభాతుల
మిసలు నింపే వెలుగు దినములు
వస్తున్నవీ కదలీ వస్తున్నవీ.

జాలు వారిన రాగడోలిక
జ్వలన మానసి ప్రజ్వలింపుల

శాంతి దీపములెత్తి అమల
శాంతి గూర్చెడు వెల్గు దినములు
వస్తున్నవి కదలీ వస్తున్నవి.

భ్రాంతిలో విభ్రాంతి గూర్చెడు
క్రాంతిలో విక్రాంతి నెరపెడు
బరువు కార్జీకటుల జిమ్మె
మెరుపు దీవెల వెలుగు దినములు
వస్తున్నవి కదలీ వస్తున్నవి.

బండగుండెల పిండి జేసే
వజ్ర నిభమౌ దండు వెల్వడి
దుండగీ దుర్యోధనాదుల
ద్రుంచి రక్తము బీల్చు దినములు
వస్తున్నవి కదలీ వస్తున్నవి.

కటిక పేదరికాల గూలే
ఝుటిల మానవ పథరథమ్ముల
విజయ సంపదలెల్లి విరిసే!
విమల తేజోమయ దినమ్ములు
వస్తున్నవి కదలీ వస్తున్నవి.

అరుణ కిరణ ద్యుతుల గలసె
తరుణ జగతిన్ విజయగీతా
రవళి మంగళ హారతుల నిడి
భవ శివోహంబను దినమ్ములు
వస్తున్నవీ కదలీ వస్తున్నవీ.



3

# చేతన

మానవుడా ! మానవుడా ! ! మానవుడా ! ! !
మానవుడా ! కదులుముందు
మంచి నీకు రానున్నది. మా.

1. చచ్చిన మానవులకు గో
ర్వెచ్చని ప్రాణాల్వోస్త్రవి
పచ్చి దొంగలకు ప్రజలు
పిచ్చి కుక్కలౌతారోయి. మా.

2. చుట్టాల సురభుల తల
గొట్టు కాల మొస్తున్నది
విచ్చిన కన్నుల లోన
విరబూచెను వెలుగు పూలు. మా.

3. కడచిన కాలంబంతయు
కంత శోషణము గాదా
విరబూచిన మల్లె పొదలు
వేగిర పడమంటున్నవి. మా.

4. తరతరాల తమ కుడ్యాల్
వరగి తరగి పోయిన వోయ్
విజయ వేదికలు నీకై
వేచియున్న వల్లదుగో ! మా.

5. వెతల నీల్లు బ్రతుకు దొలగె
వెలుగు మనకు రానున్నది
మనను మోసగించు యుగం
మంటగలసి పోనున్నది. మా.

6. భయంలేదు మానవుడికి
బ్రతుకు ముందు రానున్నది
సాగవోయి ముందు కనుచు
శాంతి కపోతమ్మ్రలచెను. మా.

7. మానవున్ని తీర్చిదిద్దు
మహో యుగం రానున్నది
అదే యుగం మన కోసం
అహర్నిశలు వెలుగుతోంది. మా.

8. ప్రగతి పథా న్వేషులగుచు
పరుగిడుచూ రమ్మన్నది
స్వార్ధ జగతి నెదురొడ్డక
సఖ్యతయే లేదుగదా! మా.

౪

# ? ఔను



మండు పెదలన్ సహనమే లే
కుండ నిప్పులు బోసితౌరా ?
గాయ పడిన యెడందలన్
కారాలు జల్లగ నెంచితౌరా ? మం.

గోడు గోడున నార్చుపేదల
బాడు నూతిని ద్రోసి తౌరా?
మాయ పాచిక లాడి తెల్యా న
మాయకులనణ చేసి తౌరా? మం.

బాధ బ్రతుకుల నీడ్చు పొట్టల
పైని మట్టిని గొట్టి తౌరా?
పచ్చ పచ్చని యిండ్ల కైని
ప్పంటు బెట్టగనెంచి తౌరా? మం.

కూలి గుడిసెల దోచుకన్ డా
బాలు గట్టగ నెంచి తౌరా?
సాని కొంపల సంఘమై లో
కాన పాపము బెంచి తౌరా? మం.

కలసి బ్రతుకే కాపురాలను
కలచి చీల్కలు జేసి తౌరా?
మంది కొంపల ముంచి సుందర
మహలునే నిర్మించి తౌరా? మం.

ఆలు బిడ్డల నేరు బరచే
కాలమునకై లేచి తౌరా?
ప్రజల రక్తము బీల్చి దొరవై
పట్నమేలగ నెంచి తౌరా?

సాగి పోయిన కాల మదిరా;
సాగదిక మతి మార్చుకోరా!
సాగదిక మతి మార్చు కోరా!....



౫

# మేలు కొలుపు

ఆకాశ వీధిలోఁ నమృత భావాలు నీ
లాకార తెరలలోఁ నవిసి పోతున్నాయి
దివి మబ్బులన్ బాపి
నవ తేజముల్నింప
మేలుకోరా! తమ్ముడా! నిద్ర,
ఏలుకోరా! జాతిని.

తార కాంతలు వూలుద్దారాల పూలల్ల
నీరజారియును పన్నీట స్నానంబాడ
మధురభావ చకోరములు మాటలాడంగ
నవ పంథలో జాతి నడపించుటకు వేగ
మేలుకోరా! తమ్ముడా! నిద్ర,
ఏలుకోరా! జాతిని.

కలువ బాలల యెదన్ పులకరింపగ ప్రేమ
నిలుపుమనె చందప్ప వెలుగులను విరజిమ్మి
నవనూత్న తేజముల్ నాట్యాలు సల్పంగ
జాతీయ విభవమ్ము జాటి యేతెంచుటకు.

మేలుకోరా! తమ్ముడా! నిద్ర,
ఏలుకోరా! జాతిని.

ప్రకృతిలక్ష్మి వడిన్ బరిఢవిల్లె ఉషస్సు
సాంధ్య శ్రీ యనలేని సంతోషమున మున్గె
బాల చంద్రుడు నిన్ను పరిహసిస్తున్నాడు
జాతీయ విభవంబు జాటి యేతెంచుటకు

మేలుకోరా! తమ్ముడా! నిద్ర,
ఏలుకోరా! జాతిని.

కోకిలమ్మలు గొంతు లిచ్చి కూయంగ
నమిలి కన్నియలు నాట్యముల సల్పంగ
రాయంచ లెల్ల నీరాజనా లివ్వ
పాలించరా జాతి పాలకుడ వయ్యి

మేలుకోరా! తమ్ముడా! నిద్ర,
ఏలుకోరా! జాతిని.

మలయ మారుత వీచికల చామరముల
జలదాంగనలు రంగు లలరించి వీవ
కాల కాంతుండు నీ పాలి దేవతగా
జాతి వీణను మీటి భాతి యొసరించన్

మేలుకోరా! తమ్ముడా! నిద్ర,
ఏలుకోరా! జాతిని.

తల ఎత్తిజూచె ఉదయ శ్రీలు మెలమెల్ల
కలత నొందుచు కదలె సాంధ్య శ్రీ లోకవైపు
అభ్యుదయ లక్ష్మి మేల్కాంచి శంఖంబూది
పరుగిడెనురా! ప్రగతి పంథ నన్వేషించి
మేలుకోరా! తమ్ముడా! నిద్ర,
ఏలుకోరా! జాతిని.



౭

# నా బ్రతుకు

క్షుద్ర జీవన యడారిలోనా,
నిద్రించెనురా నా బ్రతుకు
తల దరగిన కుక్కటమోలే
విలపించెనురా నా జీవం క్షు.

మతిమాలిన సంఘముతో నే
గతిమాలిన బ్రతుకై పోయి
వెతలంబడి సతాము నేను
శృతిలేని మృదంగ మైతి క్షు.

ఎటుబోదమ యడారులే నే
నెటు బోయిన పడావులే నా
కెటుదోచదు ధరిత్రి జూడ
కటువై కనబడె నా బ్రతుకు క్షు.

అడియాసల స్వార్థపు రాశిన్
బడి పేదల దోచే ప్రభువుల
పిడికిట యడుకొత్తుల పోకై
పడి జచ్చెనురా నా బ్రతుకూ క్షు.

నిద్రించిన జాతి ఉషస్సున్—
కదలించెను విప్లవ యూథం
యెద పొంగిన భీభత్సములో
కదలిందిర నా కల మవనిన్. క్షు.

అందర బ్రతు కానందముకై
అందర మొకటన బడు నాడే
ఎండిన యీ జీవార్ణవమూ
నిండునురా నవజల దాశలు. క్షు.

కొండల కోనలబడి కుందే
ఎండినయా జీవ గళాలు
మత్తెక్కిన మానవ లోకం బె
గ్గెత్తుక సాగిన నాడు
వడలెత్తిన గుండెల్లో నా
వడిపిడుగుల ధ్వను లెగసినచో

కడ తేరును నా బ్రతుకవనిం
బడికూలును స్వార్థ ప్రపంచం
క్షుద్ర జీవన యడారిలోనా....

## ౭

# మహా ప్రభాతము

బడబడ ధ్వనుల ప్రభాత భేరీధ్వనుల్
గణ గణమ్మని విజయ గంటలును మ్రోగి
జయ నినాదములల్లె శంఖారవమ్ము
దిక్కులెల్లను నిండి పిక్కటిల్లగ నిద్ర
లేవోయి ఓ! యాంధ్ర వీరాగ్రగణ్యా!
రావోయి నీ జాతి పావనము సేయ.

పిలచె నల్లదుగో ప్రబోధ సంరావం
పలికింది దిగ్విజయలక్ష్మి మిము గాంచి
వీరగేయ ధ్వనుల్ వినువీధి నిండ
ఖంగుఖంగున మ్రోగె కంచు తప్పెట నిద్ర
లేవోయి! ఓ! యాంధ్ర వీరాగ్ర గణ్యా!
రావోయి! నీ జాతి పావనము సేయ.

కర్పూర హారతుల్ కనక పళ్లెమున
పట్టుకొని నిల్చినది పరిమళ ద్రవ్యాలు
వీరాంధ్ర మాతదో! విజయంబు పాటరా!
జాతీయ తేజంబు సమయ నివ్వక నిద్ర.
లేవోయి! ఓ! యాంధ్ర వీరాగ్ర గణ్యా!
రావోయి! నీ జాతి పావనము సేయ.

కాల చక్రము వేగ గదలు చున్నదిరా!
పొల్లు గుండెల భీతి ఝుల్లు మన్నదిరా!
పాతభావపు లక్ష్మి పయనంబు గట్టె
పరవళ్లు ద్రొక్కెరా! పసిబట్టి క్రొత్త.
లేవోయి! నిద్ర ఓ! వీరాంధ్ర గణ్యా!
రావోయి! నీ జాతి పావనము సేయ.

పుణ్య పురుషులగని పొలుపు నించెనురా!
వీరయోధుల గని వెలసి నీ జాతి
భక్తాగ్రజులు బుట్టి పరిమళించంగ
కవి పండితుల నెల్ల గని పెంచినదిరా!
లేవోయి! నిద్ర ఓ! వీరాంధ్ర పుత్రా
రావోయి! నీ జాతి పావనము సేయ.

పెరవారిలో నెల్ల పేరు గాంచెనురా!
ధరణి సద్ధర్మలని దలపించు కొనెరా!
ఆర్తులకాప్తురాలయి జాతి యెపుడున్
వెలలేని సత్కీర్తి వెలయించెరా నిద్ర
లేవోయి! ఓ! యాంధ్ర వీరాగ్ర గణ్యా!
రావోయి! నీ జాతి పావనము సేయ.

సద్యశస్సుల గాంచి నీజాతి యెపుడు
దేశ దేశాల సందీప్తి యెసగంగా
పాడరానీ మహాంధ్రోర్వి ప్రభావం
వేడరా నీ తల్లి వీరాంధ్ర జనని

లేవోయి! నిద్ర ఓ! వీరాంధ్ర పుత్రా!
రావోయి! నీ జాతి పావనము సేయ.

అదుగో...............

కారు మబ్బుల కాంతి లహరులు
పరుగులెత్తెను వురుములట్టుగ
తిమిరలోకము చీల్చి చెండగ
తెరలుగొనె భానూదయమ్ములు.
క్షామ సంగరమందు బారలు
సాచి వెలసెను శాంతి దేవత
యవని దేవత యాత్మలో
వనలెత్తె సంబర సాగరమ్ములు.
ప్రకృతి యంతయు పరిమళించుచు
పవనుతో సయ్యాట లాడెను
భూనభంబులు బోరు బోరస
విజయుడెత్తెను విజయ శుభము.

పావనంబగు యాంధ్ర కీర్తుల
బాడివచ్చుటకై దలంచియు
లేవరా! ఓ! యాంధ్ర వీరా!
లేవరా! ఓ! విజయ వీరా!
లేచి నీ జాతీయ తేజో
వీచికలు గనరా!

కాలగర్భంబు జీల్చుక గదలివచ్చె
ఆంధ్ర వైవస్వతుండు నివ్వాళులగొన
గాన నిద్రలో కలలేమి కదలిరావ
లెమ్ము ఓ! ఆంధ్రవీర జాప్యమ్మదేల?

సమసి పోయినవి నిశాచర కృత్య గ
తిన జీవితము గడ్పు దినములెల్ల
కాలిపోయెను పన్నుగడల కుట్రలు జల్పి
బ్రతుకు కుజనుల దుర్భర దినాలు
క్షీణించె నొకరెక్క చేత పదుగురు పొట్ట
బోసుక బ్రత్కు శుభోదినాలు
గతియించెరా! సుందగతుల జీవించు దౌ
ర్భాగ్యహీనుల మనో వాంఛలన్ని.

గాన యీనాటి కుటిల సంఘా లెదిర్చి
బ్రతుక నేర్వగ యత్నింప ఫలముగలదు
ఆంధ్రులకు గల్గుయన్యాయ మంతరింప
మేలుకొని సోదరులనెల్ల నేలుకొనర!

సద్భావనీయ! సంజాత సంకల్పిత
ప్రగతి ప్రబోధంబు బల్కునాడు
విమల ప్రభావ! దిగ్విజయోత్సుకత సంఘ
సంక్షేమముకు కృషిన్ జల్పునాడు
జాతీయ తేజ! నీ జాతి ప్రగతినెంచి
విద్యా ప్రవీణులై వెలయునాడు
ఆంధ్ర ప్రభూత! యుజ్వలకీర్తి సాంప్రతన్
విహరించ శక్తిని బెంచు నాడు

జాతికే గాక వన్నె దేశంబు కెంతొ
మేలు నొనరించు వారలై మేదినిపయి
స్వర్ణ చారిత్ర పుటల నక్షరత గాంచి
మించరే రత్నకాంతి సమ్మిశ్రితులుగ.

అది మహోజ్జ్వల భవ్య సుస్థిర
తాంధ్రదేశ సమాగమమునన్

అతులయశ స్సాంద్రోప విలసిత
మతులు నైరి మహాంధ్ర జనులు
సద సమున్నత భావ పృథ్వీ
స్థలి మహోదయ రేఖ లలమగ
వెతల బొల్పడు పతిత మానవ
వితతి శృంఖలను ల్త్రోలంగగ
మూడు లింగాలొక్క చోటన్
కూడు కొన్నది లేదు భేదమ్
ప్రవిమలంబుగ గలసె హృదయ
ద్భావములు తద్భావ గతులన్
నరనరంబుల వెలసె భయహార
నవ వసంత మహోత్సవమ్ములు
తలపు దలపున దలుపరా యాం
ధ్రుల పురోగతి పాడగన్.

నిల్వరా!
ఆంధ్ర ప్రభూతా!
పిల్వరా!
ఆంధ్రా భ్యుదయముకు
తల్వరా! పూర్వ ప్రభావము

నిల్వరా!
నూత్న ప్రశస్తిని

చితికె పోయిన యాంధ్ర వీరుల
మతులు వున్నత స్థితి చెలంగగ
పతిత మానవ సంఘ మెడ గలి
మతిని సంఘటితం బొర్వగ
లేవరా! ఓ! యాంధ్ర వీరా!
లేవరా! ఓ! విజయ వీరా!
లేచి నీ జాతీయ తేజో
వీచికలు గనరా!
కీర్తి మాతకు నార్తి జూపక
జాతి దేవత భాతి నొనరగ
నీతి సంపద బెంచి దేశ
ఖ్యాతి గాంచుము యాంధ్ర వీరా!
ఎన్ని నాళ్లీ నిద్ర నీడ్చెదు
ఎన్ని నాళ్లీ సంకటంబులు
ఎన్ని నాళ్లీ లంపటంబులు
ఎందుకీ దుస్సంఘటనలన్ నలగి పోయెదురా!

ఈ నిశీదాంబుధిన్ బొరలి యేడ్వనేల?
యీ అయోమయ అజ్ఞాన మీడ్చు టేల?

అల్లదో! యాంధ్ర భానూదయమ్ము గల్గె
నవనవోజ్జ్వల ప్రగతిఁ మానవతఁ బెంచ
అంధ కారంబులో జిక్కి అహరహంబు
ఏల యేడ్చుచు నుండెదో యిన్ని నాళ్ల.
అల్లదో వెల్గు నీడల నాడుకొనగ
లెమ్ము ఓ! యాంధ్రవీర జాడ్యమ్ము దేల
తరతరాలెను వెంబడి దరలి వచ్చు
తమములం బాప మదిని ధైర్యముల బెంచి
జాతి తేజంబు గాంచ సచ్చరిత గతుల
నభ్యుదయ జ్యోతు లెల్గించ యరుగుమయ్యా
మూలబడి కుందు ముసలమ్మ వోలె నేడు
గోళుగీటును జూచు దినాలు బోయె
శక్తి కొలదిగ నవ సమాజంబులోన
నడుగు కదుపక బ్రతుకు లే దవని తండ్రీ!

కవులకు నాలవాలమయి
కాంతి రహింపగ నాంధ్రగడ్డ నీ
దివము మహోదయంబగుచు
దీప్తులు దిక్తటి నింపె భారతీ
నవ నవ తేజ పుంజముల
నాట్యము సల్పెను నాంధ్రు లెల్లరున్

భవ భయ దూరులై హృదయ
పావనులైరి యద్దేచ్ఛ చిత్తమున్

మూడు కోటుల రత్నాల కూడగట్టి
పాడుకొన్నది తెలుగమ్మ భాగ్యనగరి
అమర కీర్తిని గన్న మా యాంధ్ర జనత
విమలగుణ సాంద్రమై నేడు వెలసెనేమొ ?

మగధ రాజన్యుల మద మడంచిన నాటి
వర వీర శాతవాహనుల కీర్తి
చిత్ర నైపుణి పెక్కు చెలగినట్టియు కాక
తీయ సామ్రాజ్య వృత్తేజితములు
లాతి విలాతిలో రాజికెక్కిన నాటి
ఆంధ్ర భోజుని పురా వైభవములు
సతత మీశ్వరు దలచి కృతి యొనర్చిన పోత
నార్యుని కవితాప్రవాహ గరిమ

మధుర పదయుత రసపూర్ణ మాటలందు
తెలుగు యశ వల్లరుల్ దశ దిశలయందు
వ్యాప్తి నొందగజేసి ప్రఖ్యాతి వడసి
విజయమున్ గాంచు మాంధ్రుడా! విమల గతుల.

౮

# ప్రియురాల!

ఆ! రహస్య వచోమృతస్రు దారలందు నా
యెదను కవ్వించి వేసెదవేల ప్రియురాల!
ఆ కలువ కంటి చల్లని వేడ్క చూడ్కులో
నా శాలతా పాశముల జుట్టెద వదేల?
ఆ ముగ్ధ సుకుమార యవ్వనాంబుధి డోలి
కలనూచి నన్ను కంగారు పెట్టెద వేల?
ఆ! మనోజ్ఞ శిరీష కుసుమ పేశల సుధా
వాగ్వాహినీ నన్ను వలపు గొల్పెద వేల?
ఆ! జగన్మోహనాకార సౌందర్యము
వ్యాజ మౌ ప్రేమ చూడ్కుల నిగిడ్చెద వేల?
ఆ! రసోవచ గీతి కాలాపనమున మో
హాంబుధీ ముంచి ముగ్ధుని జేసెద వదేల?
ఆ! దరహాస చంద్రిక భాశి తా వదని
వరలు కస్తురిరేఖ వలపు రే పెద వేల?

౯

# కవిత్వము



స్తబ్ధ జగతి దిక్తటముల, సాగివెల్గు భానూదయి
సాగి వెలుగు భానూదయి
మదపు మబ్బు బెంచు రాక్ష
షెదను జీల్చు నిశిత శకం
గగన మంట నెగసి పడెడు
గర్వాంధుల బంధ నీతి
అంధకార పటలి జీల్చు
కరుదెంచెడి కాంతిరేఖ
తిరోగమన మానవులకు
పురోగతిని ప్రసాదించు
శబ్దోదధి నీదు భావ మణి
స్థగిత డోలాయం....

కవిత్వం కవిత్వం కవిత్వం........



## ౧౦

# సంఘం

పసిబాలల పవిత్ర హృదయం
మసిజేయుట కుపక్రమించి
ముసలాళ్ళకు ముడిబెట్టేసే
పసిమాలిన దుర్బల సంఘం
మారాలన్నా ! మారాలన్నా ! !
మారాలన్నా ! మారాలన్నా ! !

పతిభ్రష్టత్వము సిద్ధించి
వెతలకు గురియయ్యే వనితల
గతి బూడిద పాలొనరించె
మతి మాలిన పిశాచ సంఘం
మారాలన్నా ! మారాలన్నా ! !
మారాలన్నా ! మారాలన్నా ! !

కుటిలాత్ముల కుతంత్రములచె
నెటుకొకన్. యేడ్చెడి ప్రజల
సుడిగుండములో బడవేసి
కడు మెరుగుల గులికే సంఘం
మారాలన్నా ! మారాలన్నా ! !
మారాలన్నా ! మారాలన్నా ! !

బలవంతుల పూజించుచునూ
కులతత్వములో బడి దేశీ
యుల ఘోరాంబుధి ద్రోసేటి
వలమాలిన తొొట్టుల సంఘం
మారాలన్నా ! మారాలన్నా !!
మారాలన్నా ! మారాలన్నా !!

భగు భగ్గున మండె హృదయపు
సెగలల్లో విషాద మనియెడి
ఉడుకులు చెలరేపే రాక్షస
కొడుకుల పసమాలిన సంఘం
మారాలన్నా ! మారాలన్నా !!
మారాలన్నా ! మారాలన్నా !!

పెరవారలతో సభజేసి
కొరమాలిన తీర్మానములతొ
పరువుల నిలబెట్టు కునేటి
కురుకుల దుర్యోధన సంఘం
మారాలన్నా ! మారాలన్నా !!
మారాలన్నా ! మారాలన్నా !!

ఎద్దులవలె కష్టం జేసే
మొద్దుల పొట్టలపై గొట్టి
ముద్దుగ గద్దెలపై నెక్కి
సుద్దులు బోధించే సంఘం
మారాలన్నా ! మారాలన్నా !!
మారాలన్నా ! మారాలన్నా !!

ఒక దిక్కున నాకలి మంటల
నక నక లాడే యన్నలపై
పెత్తనముల జేయుచు వారిన్
మెత్తగ మొత్తేసే సంఘం
మారాలన్నా ! మారాలన్నా !!
మారాలన్నా ! మారాలన్నా !!

దేశానికి సేవకులమనీ
వేషాలను వేసి మోసపు
ఆశయముల లోకము ముంచే
పాషాణపు హృదయుల సంఘం
మారాలన్నా ! మారాలన్నా !!
మారాలన్నా ! మారాలన్నా !!

౧౧

# జ్యోతి

వెలుగింపరా! జ్యోతి వెలుగింపరా!
ఆనంద జ్యోతిని వెలుగింపరా!

౧ ఆ సూర్య రస్మిలా తాండ వించిన యట్లు
నీ జ్యోతి వెలుగులను నిండించి నీ యింట
కారు మబ్బులు యన్ని కదలి పోవగ యట్లు
నీ ఖ్యాతి నీ పేరు నిలచి పోయ్యేటట్లు— వె.

౨ నీ నాదములు మూడు కోట్ల నాదాల్ గలసి
నీ కీర్తనల్ వేయి దిశలు ఝల్ ఝల్ మనగ
నీ పాటతో సాటి పాటలే లేకుండ
నీ దేశ ఖ్యాతులున్ నిలిచి పోయ్యేటట్లు వె.

౩ అజ్ఞానమను నంధ కారంబు బాపగా
సుజ్ఞానమను మంచి సూక్తి వెలుగింపరా
జ్ఞాన అరుణజ్యోతి రమ్య మొప్పింపగా
విజ్ఞాన సంపదను వెలుగొంద జేయుచు వె.

౪ దేశ దారిద్ర్యంబు దారి తప్పింపగా
పాడి పంటల నింపి పరువులతొ నెల్లపుడు

నీ చమట లన్నియు నేల దడుపంగను
వెలలేని సత్కీర్తి వెలయింపగను లెస్స వె.

౫ నీ హృదయ నెత్తురుల్ వుడుకు లెత్తించగా
నీ కష్ట ఫలములే నేల పండింపగా
నీ నాగలే దేశ సంరక్ష ణార్థమని
నీ రాగ రాగాలె రోగాలు బాపంగ వె.

౬ నీ బాటలో నితర బాట సారులు నడవ
నీ దేశమున్ యితర దేశీయులున్ బొగడ
నీ దేశమునె గాక నే దేశమున నెల్ల
నీ రాగ వృత్తంబె నిలచి పోవగ యట్లు వె.



౧౭

# మేలు కొలుపు

౧ మేలుకోవోయి! భారతీయుడ
మేలుకోవోయి దేశ పౌరుడ
మేలుకొని నీ దేశ భాగ్యము
నేలు కోరన్నా! అన్నా!
మేలు గనరన్నా!

౨ భారతీయుల ప్రతి భనెంచియు
పాడి పంటల కూడికల నీ
పడక వీడియు నిద్రమేల్కొని
పరుగు లిడ రన్నా! అన్నా
తరుగ వలదన్నా!

౩ దేశ గౌరవ దీప్తి దిశలను
తేజరిల్లగ భారతీయుల
మేలుకొలుపులు తియ్యి బలుకుల
మేళ వించవలోయి అన్నా
ఆలకించన్నా!

౪ వేదవిద్యలు వెలుగు నింపగ
విజయ గీతము లాడి పాడుచు

మెల్లమెల్లగ భారతావని
మేలు గూర్పవలోయి అన్నా
మరువ బోకుమిదోయి!

౫ ఎల్లవిద్యల వాసి గాంచియు
యుల్ల మలరెడు శాంతి గీతుల
సాధు సజ్జన సమ్మతంబుగ
చనగవలెనోయి అన్నా,
సతత మిదియే నోయి

౬ బీద సాదల నాదరంబున
ప్రీతి నెంచియు పట్టెడన్నము
ప్రేమతోడుత పెట్ట వలెనోయి
పేరు కాసిడకా అన్నా!
పైస కాసిడకా

౭ దేశ దేశము లందు భారత
దేశమే బహు గొప్పదంచును
భారతావని పౌరులందరు
పాడి తెల్పాలోయి అన్నా!
కూడి తెల్పాలోయి!

౮ వీరు లందున శూరులందున
నారి తేరిన వీర వనితల

పౌరుషంబుల గొల్పు భారత
వీరు లౌదుగాలోయి! అన్నా!
పేరు గలుగా లోయి!

॥ జీవితం ఒక శక్తి యంచును
జీవితమె ఒక సత్తు వంచును
జీవితమె నానార్థ శక్తుల
నిండి వెలుగాలోయి అన్నా!
దండి నిల్పాలోయి



## ౧౩
# స్వాతంత్ర్య గీతిక

భారత సోదర! భాగ్య సుధీరుడ!
స్వతంత్ర విజయము పాడాలోయి
భారత వీరుల భవ్య చరిత్రల
పాటలు బాడుచు పోవాలోయి.
పరుగులతోడ పదండి ముందుకు
త్రివర్ణ ధ్వజమును దీసుక యవనిన్
కరతాళంబుల మృదంగ వాద్యపు
పరువడి మ్రోతల పోపొండి.
భీకర రాక్షసు లందరు భయపడ
భీతి జ్వలింపగ స్వతంత్ర శంఖము
భూం భూం భూంమను ఝుంకారంబుల
బూరా ఊదుచు పోపొండి.
భేరులు మ్రోగ భీకర ధ్వనులను
స్వతంత్ర భారతి జయ నాదంబున
ప్రపంచ మంతా ప్రతి ధ్వనింప
స్వతంత్ర భారతి గొల్వండి
శక్తుల పైపడి సవారి సల్పుచు
యుక్తులమై మన మెప్పుడు తడవక
పదండి ముందుకు జై భారతు యని
స్వతంత్ర రావం సల్పండి.

౧౪

# జోహార్లు

జోహార్లు జోహార్లు జోహార్లు
అమర వీరులార మీకు జోహార్లు

భారత నారీ మణులకు
భారతీయ వీరులకు
భారత నిర్మాణ తంత్ర
భాగ్యోపదేశులకు జో.

లోకాలకె కాక పెట్టి
లాటీలతొ పోరు సల్పి
స్వరాజ్యాన్ని సాధించిన
స్వర్గలోక వాసులకు జో

౧౫

# కన్యా విక్రయము

సొమ్ము కొఱకమ్మాయి నమ్మియు
శుభము లందగ గోరి తేమొ?
తమ్ముడా! నా మాట వినరా!
ధర్మమును గనరా!

ధనముగొని మనమరల కన్యా
దాన మనహోయంటు గాదా?
మనకు తగదా మాయ కార్యము
మనసు మార్చుమురా!

అత్త మామల టన్న నెయ్యము
అల్లునకు లేకుండ బోవును
ఉత్తమాటని మూర్ఖముగ నో
రెత్త బోకు సుమా!

కొన్న పిల్లని, అత్త మామలు
కోడలిని నిందింపగను విని
కన్నవారలు కష్టపడుదురు
కాంక్ష వీడుమురా!

బిడ్డనమ్మిన పైకమును గొని
బిడియ పడకను వాగు చుండుట
ఎడ్డెతనమే కాని, అది యొక
దొడ్డ తనమటరా !

నీతిమాలిన పనిని జేసిన
జాతికే మోసంబు గల్గును
మూతిపై మీసాలు బెట్టుక
కూతు నమ్మెదువా ?

వన్నె చిన్నెల కాసపడియును
వచ్చు ద్రవ్య మటందు వేమో ?
కన్య నమ్ముట యన్ననది యొక
కటిక బేరమురా !

పాడు ధనమున కాస పడకుము
వేడుకలు దీరుట యబద్ధము
కోడిగము జేయుదురు లోకులు
కుజను డందురురా!

రాగమున, ఆ రక్త పిండము
భోగమున, బెంచితివి కాదా ?

లోభ గుణ మెట్లబ్బె ఛీ! ఛీ!
లోతు దెలియుమురా!

బిడ్డ నమ్మిన వాడు చివరకు
ముడ్డి గుడ్డయినను నెఱుంగడు
జిడ్డి గమ్మని తలపబోకుము
జ్ఞానమున మనరా!

కూలినాలీ జేయవలదా?
ఆలు పిల్లల సాకవలదా?
కూతుళ్ల నమ్మను సిగ్గువలదా?
గుండె గొయ్యలకహ

కట కటా! యీ, కాలమేమొ
ఖలులు బిడ్డల నమ్మసాగిరి
పటములా! యమ్ముటకు అబ్బె!
పాపమే కాదా!

దొడ్డబేర మటంచు దలచియు
బిడ్డలను తెగనమ్ము శుంఠలు
బొడ్ల బడుటయె గాని వారికి
సుఖము దక్కదురా!

ఆడబిడ్డల నమ్మి పైకము
కూడబెట్టుట దోసమందురు
పేద బుజ్జుల వారలకు నీ
గోడు తెలియదురా !

ఆశగొండి వారలకు నీ
ఆశయము కంగారు చేయును
ఆశ ముదిరిన తోడనే యమ
పాశమగు నోయి !

గొడ్లవలె భావించి కాదే ?
బిడ్డలను విక్రయము చేయుట
గడ్డి మేసెడి వారలా ? యీ
కఠినతము లంతా !

ఆడబిడ్డల నమ్మ రొక్కము
మేడలకు, మిద్దెలకు పొసగదు
"బూడిదలో పన్నీరు చందము"
భువిని గాంచగను.

కటిక గుండియ గాక తండ్రి
కఠిన కార్యమునకు గడంగియు

తట పటాయించడె ధనముగొని
తనయ నమ్ముటకు.

భారతీయులమైన మనకీ
పాడు పని కూడదు సహోదర !
కార్యకారుండైన వరునకు.
కన్య నొసగ వలెన్.

మూడు కాళ్ళ ముదుసలికి నీ
ముద్దుపట్టి నొసంగితేనియు
గోడు జెందదె ? వాడు వల్ల
కాడు జేరగను.

పొంగి పొరలెడి కన్య భావ త
రంగములు తలపోయ వకటా !
మంగళాంగిని అమ్మ వలదా ?
మమత విడుమోయి !

మోజు తీరక మున్నె కన్నియ
గాజులను దుల్పును నిజము నీ
రాజియేమో ? పెండ్లి చేయగ
రాదు వినుమోయి !

కన్నె యేడుపు కన్న తండ్రికి
కత్తికోతయె కనుగొనంగను
వన్య మృగమా దాని ముడుసలి
వాని కొసగగను.

ధరను కన్యా విక్రయంబను
దయ్యమును భస్మంబు జేసిన
నరులకగు సౌఖ్యమ్ము సత్యము.
నయము గనుమోయి!

పేదలకు పెండ్లిళ్ళు జరుగని
పెద్ద కారణ మిదియె సుమ్మి
వాదు చేయక వినుము తమ్మి
వసుధపై నమ్మి.



౧౬

# ప్రభాతము

వైతాళికుడు :—

మేలుకో! మేలుకో!! మేలుకో!!!
మేలుకొను గాంధీ మహాత్ముడు
మేలు కొల్పెను దేశవాసుల
మేలు మఱచుట నీతి కాదోయ్!
మేలు మేలేనోయ్!

భారతాంబిక గర్భరత్నమ!
సూరిజన సంస్తోత్ర పాత్రమ!
హీర గుణమణి హార మిత్రమ!
విశ్వమును గను మోయ్!

ఖలులు దుర్బలులను గనుంగొని
యిలను కొంపల దీయ గను విని
నలగ ద్రొక్కెడు మార్గమును గని
ఫలము గనుమోహోయ్!

స్వార్థ త్యాగివి నీవు సత్యము
సార్థకంబగు నీదు జన్మము

స్వార్థులకు జ్ఞానంబు గఱపను
సాహసింపగదోయ్ !

జహ్వారార్యుల యడుగు జాడల
జగము నడువగ గోరుచున్నది
వహ్వారే ! యనునట్లు నీవు
వాసి గాంచ గదోయ్ !

దేశ శ్రేయము గోరి నిత్యము
దేశ ద్రోహుల మదమడంచుము
దేశ సేవయె ఘనమటంచును
దీక్ష బూన గదోయ్ !

కూడు; గుడ్డ; గుడిసె; గానని
పాడు బ్రతుకని రోయగను విని
మేడ లెక్కియు బీదవారల
గోడు దెల్ప గదోయ్ !

ధర్మ, మర్మము గనిన మనుజుడు
దాతయన బ్రఖ్యాతి గాంచును
ధర్మ మర్మము గనని లుబ్ధుడు
దాత కాబోడోయ్ !

బీదవారల రక్తమంతయు
బీల్చి ద్రవ్యము పోగుజేసియు
మోదమందెడి కర్బూర మృగమిల
మోక్షమును గనరోయ్!

కాయమా! క్షణ భంగురము బహు
కాలముండు నటంచు బలుకకు
శాయ శక్తుల పేద వారికి
సాయ పడవలె నోయ్!

ధనము భూమిని దాచిపెట్టిన
తస్కరుల పాలౌను సత్యము
జనతకది దానంబు జేసిన
జాల మెలగునోయ్!

ధనము గల్గిన వ్యక్తి జనులకు
ఘనత గల వైద్యాలయంబుల
దనర జేయుట పుణ్య కార్యము
దయను బూనగ దోయ్!

ప్రజల కొఱకయి పాఠశాలలు
ప్రమదమున నెలకొల్ప జేసిన
సుజనులకు యశ మబ్బు ననియెడి
సూక్తి గనుగొను మోయి!

ప్రజల కుపకారంబు జేయని
పాపి కిహపర సౌఖ్య మబ్బునె ?
గజి బిజింబడవలదు ధర్మము
గనిన శుభమగు నోయ్ !

ప్రాయమా ? మితిమీరి పోయెను
కాయమా, శుష్కించి పోయెను
దాయ బెట్టిన ధనము దానము
చేయు టొప్పగునోయ్ !

గోచిపెట్టియు బాటసారుల
దోచినట్టి పాప కర్ముడు
దాచిపెట్టిన పాప మెప్పుడు
దాగ దనుకొను మోయ్ !

మాయ వేషము వేసికొనియు న
మాయకుల మోసంబు జేసిన
మాయకాడెంతైన తప్పక
రోయ బడునోహోయ్ !

బ్రహ్మ రాక్షసులన్న దీనుల
బ్రతుకనీయరు లోకమందున
జిహ్మగంబుల బాపు వీరులు
చేదు వారల కోయ్ !

ఘనులు మును స్వాతంత్ర్యమునకై
తను మనోధనముల నొసంగిరి
మనము దేశ క్షేమమునకై
మనుట మెప్పగునోయ్ !

ధర్మ మడుగంటంగ జేసెడి
దక్షులున్నా రిలను కొందఱు
కర్మ ఫలము నెఱుంగ జాలరు
క్రౌర్యమతులో హోయ్ !

కవుల భిక్షువులనుట దోషము
కవులనిన లోకోపకారులు
కవులనిన పరమార్థ మెఱుగక
కలత పడవలదోయ్ !

కాలమున గల విలువ దెలిసియు
కర్మ జీవుల గలసి మెలగియు
కల్మషంబును కడకు జిమ్మియు
ఘనత గనవలె నోయ్!

ప్రేమయే ముఖ్యం బటంచును
పృధ్వి జాటిరి పుణ్య పురుషులు
ప్రేమయే లేనట్టి మనుజులు
పెద్ద దయ్యాలోయ్ !

మనసులో దలపోయు టొక్కటి
మాటలాడు విధంబ దొక్కటి
పనిని జేసెడి పద్ధతొక్కటి
పనికి రాదను మోయీ !

నేను వైతాళికుడ గావున
నిద్రనుండి మేలు కొల్పితి
జ్ఞాన ధనమో దేశ నాయక !
మానవుల కొసగోయీ !



౧౪

# మధుర గీతి

ప వ౹ పంతి :—

మధుర గీతి విన వొచ్చెను
మానసాబ్జము వికసించెను
మధు మాసము కాదా ? సఖీ !
మధుపంబుల ఝుంకారమొ ? మధుర

వింత వింతరాగ మెపుడు
ఎవరి నోట వినలేదె ?
భ్రాంతి గొల్పుచున్న దహహా !
పరభృత సంరావ మేమొ ? మధుర

పల్కు పల్కున జుంటి తేనియ
లొల్కు కరణి దోచుచున్నది
చిలుకలు చెలరేగి చేయు
కిల కిలార్భటులా ! అవేమొ ? మధుర

సరిగమ లవిగో !.........వాహ్వా !........
శ్రావ్యమైన స్వరము ఘనము
పరి పరి విధముల నొక్కులు
పరికింపుము వేణువేమొ ? మధుర

అదిగో ! మోహన మూర్తి మోము
పొదల మాటున వెల్గుచున్నది
చదల రిక్కల నడుమనిండు
జాబిలియౌనో అదేమొ ?        మధుర

ముద్దులాడి నీవు పోయి
ముద్దు కృష్ణుని దోడి తేవే
జిద్దుచేసి పోయినాడు
హద్దుమీరి పల్కితేమొ ?        మధుర

ఝుణ ఝుణ ఝుణ ధ్వనులు వినుము
గుణమణి మత్ప్రియుని గనుము
ఋణ పడితిని సేవకనుము
గుణ నిధి యిటు రాడేమొ ?        మధుర

ఏలొకో ! మద్గృహము జేరక
పూల తోటకేగి మురళి
కేలబూన గొల్ల పడుచులు
ఖేలనకు గడంగిరేమొ ?        మధుర

చెణుకులు వలదని చెప్పుము
చెలియరో వే వేగ జనుము
ప్రణతి శతము లనుము వినుము
ప్రణవ రూపుడు రాడేమొ ?        మధుర

ఆగు మాగుము నేను వచ్చెద
నాగమ వినుతుని గాంచెద
సాగిల పడి మ్రొక్కెద నా
స్వామి వేగ రాడేమొ ?                    మధుర

## ౧౬
# వీర ప్రశంస

లేరా !....లే లేరా ! !....లే లే లేరా ! ! !........
లేరా ! బాబు ! దేశ నాయకులు
వీరా వేశ ప్రపూర్ణ వాక్సుధా
ధారా వాహిను లవనిం బలుపియు
కారా గారాల్ జేరిరి పుటవకు లే॥

పారావార గభీర మనస్కులు
ఘోరాటవు లెందైనను జడియర
హేరాళంబగు దీక్ష వహించియు
పోరాటము సల్పిరి సాహసమున లే॥

భీతిలేక దాస్యము నిరసించియు
భూతలమున బ్రఖ్యాతి వహించియు
హేతిచ్ఛట లటు వెల్గుచు నుండగ
శ్వేత సింహముల జెండాడిరి, భళి లే॥

భారతాంబ యాశీస్సుల బడసిన
భద్రయశులు వీరాధి వీరులై
పారతంత్ర్య భూతము బరిమార్చియు
ధారుణి స్వాతంత్ర్యమును గడించిరి లే॥

అండ విడచి యాంగ్లేయులు చనగనె
ఖండన బలులౌ భారత వాసులు
దుండగీంద్ర దుంటగము లడంచిన
మండలేశ్వరుల గుండె లదరె నిక లే॥

హీరో పాత్రల వెలసిన వీరులు
ధైర్యోత్సాహములను దార్కొనియును
కార్యోన్ముఖులై కడుబంతంబుయ
మార్గోమ్మయగ బలియై పోయిరిమును లే॥

హిందూ ముస్లిము లైక్యత బాయగ
వందే మాతరమనుచు మహాత్ముడు
సందేహములను బాడిన విషయము
సర్వ దిగంతములను వ్యాపించెను లే॥

అమ్మహాత్మ సేవా పర తంత్రులు
ఇమ్మహి ఋణపడి యుంట నిజంబె
క్రమ్ముకొనిన గాఢాంధకార మెగ
జిమ్మిన నీకు చిరాయువు గల్గును లే॥

భారత భాగ్య విధాత ప్రత్యహము
భారతీయులకు జేసిన బోధను
పారమార్థికము ప్రభలి మనంబుల
ఘోరమైన పాతకము లడంగను లే॥

మానవ సేవా మహాత్మ్యంబులు
జ్ఞాన దాతయో గాంధి మహాత్ముడు
భూనభోంత రాళములను జాటెను
దీన జనుల గాపాడను వేగమె లే॥



౧౯

# విలాసిని

ఓ! విలాసిని! మత్తకాసిని!
ఓ! సిశాకిని! యీ నిశీధిని
భావ్యమగునె? యూలవేసెదు
భర్మ హార్మ్యమునన్,

యుష్మదంఘ్రి ద్వయిని భువి సం
యోగ్యమని యౌదల ధరింపను
భీష్మ భావ ప్రపూర్ణవై నీ
ప్రియుల బిల్చెదవేఁ.

నీహరౌయల్ గన భూవరుల్ ఘన
సాహసుల్ ధర రేబవల్ దా
సోహమనుట జగద్విదితమె.
సుషమ సంభాషి.

నీ వయారము గాంచి మోహము
నిల్పజాలక యువక బృందము
కావవే మమ్మంచు వేగమె
కౌగిలింపగను.

నీదు తళుకు బెళుకు లంగన
నిర్భయంబుగ గలసి మెలసి
మోదమందెడు వారిగని నా
మోక్షి చేసెదవు.

మోహినీ! నీ మోహితులు వ్యా
మోహమను గాలమున బడుటను
సాహసించిన మత్స్యములె యో
సత్య మరయగను.

నీదు యధరా మృతము గ్రోలియు
నీల్గుచుందురు విటులు కొందరు
పాదు గనగది కాలకూటము
పదిగి బాధించున్.

ఓసి మాయల మారి! యువకుల
మోసగించియు ముదము గూర్చియు
దాసులుగ జేసెదవహో నీ
దర్పమును గనగన్.

భోగినీ మణి! నిన్ను గాంచియు
భోగ్యమంచును దలచి విటులా
రోగ్యమును జెడివెతల గుందగ
రోయు చుండుదు వే

నీదు మోహము సర్వనాశము
నీదు మోహము కాలపాశము.
నీదు మోహము ఖేద మూలము
నిశ్చయము గనగన్.



## ౨౦

# "మోహన్‌దాసు"

మంచివాడు మోహన్‌దాసు పుట్టినాడు
మంచి మార్గంబు మనకు చూపినాడు
తల్లి పుత్లీబాయి తండ్రి కరంచంద్
తొల్లి నోచిన యట్టి నోములె పసంద్

పోరు బందర్ పురంబను పుణ్యభూమి
పౌరుష జ్ఞాని కయ్యది జన్మభూమి
బాల చంద్రునివలె వృద్ధి గాంచినాడు
చాల చదువులు శ్రద్ధతో చదివినాడు

భావమందు సుజ్ఞానంబు బూనినాడు
దైవ ప్రార్థన తప్పక జేసినాడు
సత్యవ్రతమును భువిని సాధించినాడు.
నిత్య సంతోషియనగను నెగడినాడు

లోకమందు వైరంబును రోసినాడు
ఐకమత్యంబు బలమంచు బల్కినాడు
కాయ కష్టంబు జేయంగ గడగినాడు
ఆయురారోగ్యముల బడయ గల్గినాడు

కోపతాపంబు లయనంబు గోరబోడు
పాపకార్యంబుల యందు, పాలుగొనడు
వింత వింతైన పలుకులు, పలుకుచుండు
శాంత్య హింసలనె గమనించుచుండు

ఆగమము లందు సారమార్జించినాడు
త్యాగ ధనుడంచు సత్కీర్తి గాంచినాడు
జాతి వైషమ్యముల జోలిదీయ బోడు
భూతదయ మానసంబున వీడబోడు

పారమార్థిక బుద్ధిని బడసినాడు
భారతీయుల బాధల బాపినాడు
ధైర్య సాహసమును వెలిబుచ్చినాడు
ఘోర దైత్యుల వెడలంగ గొట్టినాడు

తల్లి దండ్రుల సేవించు ధన్యతముడు
ఎల్ల గురువుల భూషించు వేదవిదుడు
ప్రాణముల ధారపోసిన భావ విదుడు
రాణకెక్కెను మానవలోక బుదుడు

లోకమాన్యుండు స్వాతంత్ర్య సిద్ధికొరకు
భీకరా కారుడై పోయె భువిని చెఱకు
రీకు రాకూల తానిరసించినారు.
బేక్ బేకంచు ఖద్దర్ ధరించినాడు

జై హింద్ నినాదాలాల కించినాడు
జై జై యంచు తాను హర్షించి నాడు
ఎండ వానల్లో తాసంచ రించినాడు
మెండు గాడ్పుల ఢాకల కోర్చినాడు

ఆశ్రమంబును తానెల కొల్పినాడు
ఆశ్రయంబిచ్చి దీనుల గాచినాడు
కారణాత్ముండు స్వర్లోక మేగినాడు
భారతీయుల దుఃఖాబ్ధి ముంచినాడు

యిట్టి యాదర్శ జీవి కిల్లిదుగో జోహార్
మిట్టపడి మరవకను నిత్య చేయుము ప్రచార్
అమ్మహాత్ము కీర్తికాయ మారయ భువిన్
ఆ చంద్ర తారార్కమై యంతట వెల్గున్
బాపు సుగుణంబు లెన్నంగ భాగవతంబగున్
బాపు కథ వ్రాయనది యొక్క భారతంబగున్



౨౧

# భరతమాత

జయ్ భరత మాత యని పలుకాలి
జయ మొందెడి పనులను చేయాలి
నవయుగ మే తెంచెను కదలాలి
నవయువక శిఖామణి నడవాలి

నవ నాగరికత గమనించాలి
నగవులలో వెన్నెల చిందాలి
నవ నీతము వలె మది కరగాలి
కవగూడియు కష్టము చేయాలి

త్రికరణ శుద్ధిని బడయాలి
త్రివర్ణ పతాకము, నెత్తాలి
హరిజనులను కడు ప్రేమించాలి.
అస్పృస్యత నడుగున ద్రొక్కాలి

జాతీయ గీతములు పాడాలి
జయ జయ నినాదములు చేయాలి
భూతదయను పాటించాలి
భూతలమున కీర్తిని పొందాలి

నిజ దీక్షను మది సాధించాలి
నిస్వార్థులమై జీవించాలి
స్త్రీ జనాభ్యుదయ మును కోరాలి
స్థిర చిత్తముతో గౌర వించాలి
ఈర్ష్యాసూయలను విడువాలి
పరస్పర మైత్రిని కోరాలి
అజ్ఞాన తిమిర మడు గంటాలి
సుజ్ఞాన చంద్రికలు హెచ్చాలి
విజ్ఞాన విలసనము గాంచాలి
విశ్వంబున కీర్తి వహించాలి
గాంధేయ తత్వమును గాంచాలి
గర్వంబును మదిని నడంచాలి
ప్రాజక్టులనే నిర్మించాలి
ప్రాభవమును జగమున జాటాలి
సాగరముల కాల్వలు తీయాలి
సస్యశ్యామలమును జేయాలి
సాహస కార్యములను జేయాలి
స్వాతంత్ర్య ప్రభలు వ్యాపించాలి
సౌహార్ద్రిత మనమున ప్రబలాలి
సౌభ్రాత్రత జగమున జాటాలి

నీతి గలిగి చరియించాలి
ఆతిధ్య మొసగి హర్షించాలి
విద్యుద్దీపములే వెలుగాలి
పైవిద్య విమానాల్ వెలియాలి

లలిత కళలు పెంపొందాలి
ఫలితమ్మును క్రమ్మర బడయాలి
బాల బాలికలు చదువాలి
పట్టభద్రులై వెలయాలి

ఆరోగ్య మార్గమును కోరాలి
ఆనంద సమృద్ధిని గాంచాలి
మానవ సేవకు మది పొంగాలి
మాననీయులై బ్రతుకాలి

శాంత్యపేక్ష పెంపొందాలి
శాంతిని భువి స్థాపించాలి



౨౨

# కోకిలా!

కోకిలా ! ఇంత కోపమేలా నీకిలా
నీకు నాకె తగుసు హేలా
చాకచక్యము జూపుదేలా !
రాక నిటు చెలరేగ మేలా
రహిదొలంగగను

మేలమా ? ఇంత జాల మేల శంకుతమా !
కలరవమ్ముల జేయు పక్షులు
ఫలములను బక్షించి వేడ్కలు
జెలగ మనుజుల కైకమత్యము
యిలను జాటగను

ఏలుకో ! నా పలుకులను విని మేలుకో.
కాలచక్రము కదలి చనగను
బేల తనమును బెంగ గనకను
లీల మర్కట చయము బ్రతికెడు
లీల జాటగను

సౌమ్యమా! నీ సాహసము సంభావ్యమా!
గమ గమల కుసుమముల గనుగొను
భ్రమరముల ఝుంకారముల విను
విపులమగు జీవన మసంగను
విశదమగు నీకుఁ—

గానమా? కలకంఠమా! అభిమానమా?
స్థాన తలమా? నేను బిలిచిన
మానవా? నీ హారముపులుగా?
జ్ఞాన మిసుమంతయును గనవా?
మేను మరచితివా?



## ౨౩
## సోదరా

ఒడ లెఱుగక తిరుగుట విడుమా
బడ బానలమును గోరకుమా
గడబిడ జేయక మెల్గుమా
తడబడకను కీడును విడుమా ॥ఒడ॥

పుడమిని దీనుల గన్గొనుమా
హడలును బుట్టింపక మనుమా
సడలును దేహాముమును వినుమా
గడ గడలాడును గనుగొనుమా ॥ఒడ॥

తడబడు నడుగులు గన్గొనుమా
దడదడమను గుండియ వినుమా
పుడమిని జీవించను వినుమా
నడవడి సరిజేయుట గనుమా ॥ఒడ॥

అడవులలో బడి తిరుగకుమా
గడనకు మార్గంబును గనుమా
సుడిగాలిని బడి పోవకుమా
మడియుట తప్పదు మఱవకుమా ॥ఒడ॥

పడి కొరకొక వృత్తిని గనుమా
మిడిమేలపు దొరగొల్వకుమా
కడుకొను పనులను వీడకుమా
నడు పీనుగువై బ్రతకకుమా ॥ఒడ॥

౨౪

# అందాల రాణి!

బాలికామణి! భ్రమర వేణి!
పలుకవే మృదు భాషిణీ!
కాలయాపన మేలనే? నను కౌగిలింపను గుణమణీ!

పూలబంతుల నాడి నఖులతో
మేలమాడు విలాసినీ!
చాలునే రసాల సాలము ఛాయకేగు సుహాసినీ!

పూలుగోసి సరోవరమ్మున
నోలలాడె దుకామినీ!
చాలు చాలిక మందిరముగను మేలుగల్గును మోహినీ!

లోకమే? మఱచితివి కాదే!
లోల నయనా! విధుముఖీ!
లోకులేమను వారలోమును లోతుగనుమో ప్రియసఖీ!

స్త్రీ జనాభ్యుదయమ్ము గోరుము
శీఘ్రగతిని మనోహరీ
అజనార్దను డొసగు నీ కాయుష్య మోతలోదరీ!

ఈవు మహిళా లోకమందలి
ఈర్ష్యబాపు సహోదరీ!
కావుమో అందాల రాణీ! కలుష మతుల శుభంకరీ!

# దీపావళి

దీపావళీ ! సు రూపావళీ !
మాపాలి దివ్యహాళీ !
కాపాడు సుస్వరాళి
నీపావలి జనాళి
    ఆహా హా ! ॥దీ॥

కళ కళ లాడెడి మోములు
తళ తళ లాడెడి దుస్తులు
కళ వళ మొందని మనములు
గళముల భాసించు నగలు
    ఆహా ! ఆహా ! ॥దీ॥

తల్లులు పిల్లల గుంపులు
మల్లెలు మొల్లల దండలు
కొల్లలుగ ధరించి నివాళులు
మెల్లగ నీయ విరాజిలు వేడ్కలు
    ఆహా ! హా! ॥దీ॥

పరిమళ ద్రవ్యములు మేనుల
మురియుచు నలదిన సువాసనల
పరిపరి విధముల మనముల
త్వరితగతి రంజిలగ హాయుల

నగవుల చంద్రికలై గయిను
మగలను మగువలు బిల్వాను
నిగ నిగ కస్తవలు మెరయను
సొగసగు చూడ్కులు గవయను
ఆహా ! హా! ॥దీ॥

ధగ ధగ వెల్గెడి జ్యోతులు
పగలు సేయు వెన్నెల పంతులు
పగలు యెల్లి పాయ టపాకులు
నగర మెల్ల వాద్య ఘోషలు
ఆహా ! హా! ॥దీ॥

ధనవంతులు హర్షింతురు
ధనలక్ష్మిని పూజింతురు
పనులన్నియు విరమింతురు
ధనహీనుల ప్రేమింతురు
ఆహా ! హా ! ॥దీ॥

స్వాగతంబునీకు జనని
రాగమింత బూను మదిని
త్యాగధనుల గావు మదిని
భాగవతుల మనవిని విని
ఆహా ! హా ! ॥దీ॥

౨౫

# నడ గడియారం

నడ గడియారం నడ గడియారం
పుడమి జనులు పోషించు వయారం
నడల హొయలు నయనోత్సవం
గడన సల్పు కామ్యోత్సవం

మహోజ్జ్వలాంగం మహోదయం
సుహృజ్జనాంగం శుభోదయం
కొక్కొరో కోయను గంభీర ధ్వానం
మక్కువ గొల్పు మహాద్భుత ధ్యానం

సరభస యానం సమధిక జ్ఞానం
ధరను పాంథజన ధైర్య ప్రధానం
కాంచనమణి గణ గర్భిత కవచం
పంచవర్ణ శోభస్ఫుర పింఛం

సాహస కృత్యం సాధక ధ్యేయం
సాహచర్య సంస్థాపిత న్యాయం
జాత్యభిమానం జన్మ ప్రధానం
నిత్యోత్సాహ పునీత జీవనం

# -: ముద్రణా సహాయకులు :-



| | |
|---|---|
| శ్రీ గడ్డంపల్లి నారాయన్ రెడ్డి, ఎం. ఎల్. ఏ. | శ్రీ పల్లా చంద్రారెడ్డి గారు |
| | ,, పొట్టుముత్తు తిర్పతయ్య ,, |
| శ్రీ ఎం. కొండరావు (వకీల్ గారు) | ,, పాశం రుక్మారెడ్డి ,, |
| ,, డి. పుల్లారెడ్డి ,, | ,, బత్తిని ధర్మారెడ్డి ,, |
| ,, ఎం. రంగారెడ్డి ,, | ,, వాసు దేవరావు ,, |
| ,, గార్లపాటి దశరధం గారు | ,, గందె రాజయ్య ,, |
| ,, పోలిశెట్టి తిర్పతయ్య ,, | ,, బొజ్జ జంగారెడ్డి ,, |
| ,, గుడుగుంట్ల చంద్రయ్య ,, | ,, బండారు చినమల్లయ్య ,, |
| ,, గార్లపాటి పెదవెంకయ్య ,, | ,, నాయిని పాపిరెడ్డి ,, |
| ,, గార్లపాటి చినవెంకయ్య ,, | ,, యజ్ఞ నారాయణ శాస్త్రి ,, |
| ,, జూలూరు అంతయ్య ,, | ,, గార్లపాటి రాజయ్య ,, |
| ,, గుడుగుంట్ల రామయ్య & కంపని గారు | ,, మల్లేశం ముస్తాజర్ ,, |
| | ,, సుధాకార్ రెడ్డి ,, |
| ,, భోనగిరి ఈశ్వరయ్య ,, | ,, సముద్రాల రాజయ్య ,, |
| ,, ఉప్పంచ వెంకటేశం ,, | ,, భోనగిరి మట్టయ్య ,, |
| ,, సత్యనారాయణ,ఆయిల్ మిల్ ,, | ,, జహంగీరు మాష్టర్ ,, |
| ,, దామెర నరసింహులు ,, | ,, ఆలంపల్లి రఘురాములు ,, |
| ,, యస్, మారయ్య ,, | ,, మోరా నారాయణచారి ,, |
| ,, జి. విష్ణుమూర్తి ,, | ,, యస్. జయపాల్ రెడ్డి ,, |
| ,, వాసా అంతయ్య ,, | ,, కటకం రత్నయ్య ,, |
| ,, తెనుగుపల్లి నరసింహారెడ్డి ,, | ,, ఆలంపల్లి పీరేశం ,, |
| ,, పల్లా పర్వతరెడ్డి ,, | ,, పనపర్తి యాదగిరి ,, |
| ,, మల్ రెడ్డి వెంకటరెడ్డి ,, | |

పై వారు మా రచనాభివృద్ధికిగాను అభిమాన నీయులుగా తగు ఆర్థిక సహాయ మొనరించి యీ గ్రంథ ముద్రణకు తోడ్పడినారు సోదరులైనవారు.

సాహిత్యాభిమానులైనవారు. చాల చైతన్య సద్భావనాశీలురై యీలాగే సర్వదా సహాయ సహన శీలురై ఉండుటకుగాను మేమెంతయో ప్రార్థిస్తున్నాము.

వీరందరకు భగవానుడు.

చిరాయురారోగ్యముల ప్రసాదించి రక్షించునాక

ఇట్లు,

ప్రచయితృ.

